మదనవల్లి:—అక్కా! మన మిన్నినాళ్ళు మగవేసంబు ధరియించి, తిరుగులాడెదముగదా. మనల నెవ్వరును స్త్రీయని కనిపెట్టక పురుషులేయని భ్రమఁ జెందు చున్నవారు! అదియునుంగాక మనలను జూచునట్టి ప్రతి సుదతియు మనలఁ బెండ్లియాడఁగోరు చున్నది. ఇందులకుఁ గారణంబేదియో యూహింపఁ జాల కున్నాను.

మనోరమ:—అమ్మా! ఒకరొకరు అనుభవించునట్టి సుఖంబుల కన్నింటిక దైవసంకల్పమని తీర్మానించినను, వారి వారి పూర్వ జన్మమునఁ జేసిన కర్మానుసారమే యగును. అందుల కొక పురాతనేతి హాసంబు కలదు చెప్పెద వినుము.

మదనవల్లి:—నీవట్టులనే చెప్పుమమ్మా! ఏలనని యం[illegible] గొన్ని వేళల మదికి ధైర్యంబు తగ్గి యల్లలా[illegible] విట్టి యితిహాసంబులచే నివర్తిల్లఁగను. స[illegible] యానందోదయ మెట్టులగును. ఆనందోదయంబులేక మన[illegible] లమై యుండదు. కావున వేగ నెఱింగింపుము. అని యనఁగ మనోరమ సంతసించి యిట్లు చెప్పుచున్నది.

రాజుల జయించిన సౌందర్యవల్లి కథ.

అమ్మా, మదనవల్లీ! పూర్వకాలంబున శాంతిపురియను పట్టణంబును ప్రతశీలుండను మహారాజు కీర్తి ప్రతాప ధురంధరుఁడై పరిపాలించుచుండెను. అతనికి ఇరువదుగురు మగబిడ్డలు. వారలెవరకని భయపడని యసహాయ శూరులు. వారిపేరన్న లోకములు బెగడును. అట్టులుండ ప్రతశీలునిభార్య గర్భవతియై పదియవమాసంబున నొక శుభ దినంబున నాఁడుబిడ్డను గనెను. ప్రక్కనున్న చెలికత్తెలు పరువెత్తి వచ్చి రాజున కెఱింగించిరి. అదివిని రాజు భాగ్యమన్న నిదిగదాభాగ్యము. మగబిడ్డల నిరువదుండ్రఁగని యింటికి యిరువదుండ్రు కోడండ్రు

వచ్చిరి. ఇపుడొక యాడుబిడ్డ పుట్టెను. ఈ బిడ్డను చక్రవర్తి కుమారున కిచ్చి మహదానంద భరితుండ నగుదును. నాకు సాటి యెవ్వరు? అని యెంచెను.

దాదులు తల్లికిని బిడ్డకును మంగళస్నానంబు లాచరించిరి. సౌందర్యవల్లియని నామకరణంబు బ్రాహ్మణోత్తములు చేసిరి. ఆబిడ్డ బాల చంద్రునివలె దినదిన ప్రవర్ధమానయగుచుండెను. మూడవయేట విద్యాభ్యాసంబు చేయించిరి. అచట సకల కళలయందు నాటి తేలెను. ఐదవ యేట ధనుర్వేదంబును సాంగోపాంగముగా ననుభవ యుక్తంబుగా నేర్చెను. వింట బాణంబు గీలించి యుద్ధంబు సేయుమార్గంబును అస్త్రంబు ప్రయోగింప నుపసంహారంబు సేయను జక్కగా నేర్చె యట్టి యని పేరెత్తెను. ఈబిడ కుపాధ్యాయుడు రహస్యంబుననే జేసి యీమె యింతటిదియని యెవ్వరికిని దెలియదు. అయి మాత్రము తన కొడుకులకు సమాన మెవ్వరును లేరని నుండెను.

సకల దేశాధిపతులకును నొడయండై చక్రవర్తియను పట్టంబున దనరువాడొకడు తనకు సకలదేశంబులరాజులును కప్పము తప్పక గట్టుచుండుటయు శాంతపురిరాజుమాత్రము కప్పమును మూడేండ్లుగా కట్టకుండుటయుం గనిపెట్టెను. పరిజనుల నతండేల కట్టుటలేదని యడిగెను. పరిజనులు చక్రవర్తింగని "సార్వభౌమా, శాంతపురి రాజు మిగుల నుత్తముడు. వ్రతశీలుండను నామంబు గలవాడు ఇదివఱకుం దప్పకయే కప్పము గట్టుచుండెను. ఇపుడు మూడేండ్లుగాం గట్టకుండుటకుం గారణము అనావృష్టియని తలంచెదము. లేనిచో నతని కప్పమే మనకు మొదట వందునదియని చెప్పిరి." అట్లనే యుండవచ్చునని చక్రవర్తి తలంచెను. సజ్జనులు తెల్లనివన్నియు పాలనియు, నల్లని వన్నియు నీళ్ళనియు ననుకొందురు గదా. అది యటుండనిమ్ము. "చెట్టుచెడుకాలమున కుక్కమూతి పిందెలు పుట్టు"నను సామెత మేరకు, ఈవ్రతశీలుడు పేరాసగలవాడై, యుద్ధంబున మనకొడుకులు తేలెదవారుగదా. వారి

సాహాయ్యంబున మనము చక్రవర్తిని నిరసించి, సార్వభౌమత్వము నేల చేకొనరాదు? మనకు వాడెట్లు చక్రవర్తి యగును. వానికిఁ గప్పము కట్టుటేల యని మూడేండ్లుగ చెల్లించిన వాఁడు కాఁడు.

చక్రవర్తికి వ్రతశీలుని దుస్స్వభావం బెటులఁ దెలియును. అది తెలియనందున చక్రవర్తి యొకనాఁడు మంత్రిని బిలిపించి, మంత్రివరా! నీవు శాంత పురంబున కేగి యాయూరి స్థితిగతుల నెఱుంగుము. రాజ్యము సుభిక్షమై యుండునేని వ్రతశీలునిం గనుము. అతఁడు చెల్లింప వలసిన బాకిని నడిగి వసూలు చేసికొని రమ్ము. అట్లుగాక కాటకం బుండునేని నతనింగొని యిటకు రమ్ము. క్షామ నివారణార్థమై ద్రవ్య సహాయంబు చేసెదము అని చెప్పి పంపెను. ఆ మంత్రియు నట్టులనఁ గానిమ్మని సమ్మతించి, తనకు సహాయంబుగాఁ గొందఱు సేనలనుఁ బిలుచుకొని శాంతపురికి వచ్చెను. తనరాకను దూత మూలకముగా నెఱింగించెను. అపుడు వ్రతశీలుఁడు మంత్రి యేలవచ్చి యున్నాఁడను సంగతిని విచారింపక, "ఆత్రగానికి బుద్ధి మట్టు" అన్నట్లు తన కుమారులంబిలిచి, నా ముద్దుకుమారులారా! నేనొక సంగతిం జెప్పెద వినుడు. మనయూరి నుండి కప్పముపోయి యీసారికి మూడేండ్లగుచున్నది. కప్పంబు గొని వచ్చుటకు దనమంత్రిని బంపియున్నవాఁడు. ఇందుల కొక యాలోచనఁ జెప్పుదురు గాక యని యడిగెను. వారలు మనోగర్వము నందినవారగుటం జేసి, తండ్రీ! మీరలు ఎందులకు భయంపడకుఁడు వాఁడు చెడినాఁడు. మే మిరువదుండ్రము విలువిద్యయందు నాటి తేఱిన వార మగుటచేత శత్రువుల చీకాకులై పఱువం జేసెదము. భయంబేల యని ధైర్యంబు చెప్పిరి. అంతట నా వ్రతశీలుఁడు మంత్రిపంపిన దూతతో ఓరీ! మీమంత్రి కడ కేగి నా మాటగా నిట్లనుము. కప్పమునకై యింతదూరము వచ్చితిరి. ఇట కప్పము లేదు. నీళ్ళయందు నవారిగాఁ గప్పలున్నవి. కావలసినఁ బట్టుకొని పొమ్ము. నీవు చక్రవర్తివని మేము గైకొన్నగదా నీకుఁ గప్పము వచ్చును. కప్పము లేదు గిప్పము లేదు. మొగంబున మీసము గలవారలైన నిటకు రమ్మనుము, మేము వింటితో గప్పంబు గట్టెదము అనియె.

ఆ మాటలను వినిన దూతలు ఆశ్చర్యమొంది ఇదేమి కాలవిపరీతము. చక్రవర్తితో యుద్ధంబన వెన్నమ్రింగుటవంటిదని యీ రాజు తలంచెను గాంబోలు, అని యొకరితో నొకరు చెప్పుకొనుచు, మంత్రి కడకువచ్చి యెఱింగించిరి. ఆ మాటలనువిని మంత్రిశేఖరుండు దిగ్భ్రమ నొంది మనమిక నారాజునొద్దకు సమక్షంబునంబోయి విచారింప వలసి యున్నది. ముందువెనుకలు యోచింపక చక్రవర్తి కడకుంబోయి, వీరి మాటల నమ్మి చెప్పరాదు. అతడేమిచెప్పెనో వీరేమి వినిరో, కడ కిది యెటుబోయి యెటువచ్చునో యని తలపోసి రాజనగరునకు వచ్చెను. మొగసాలనున్న కావలివారలు రాజున కెఱింగించిరి. వ్రతశీలుండు తన్ను జూడవచ్చిన మంత్రిని దగువిధంబునం బూజించి, యర్ఘ్యాసనం బిచ్చి తన యొద్ద గూర్చుండఁ జేసెను. వ్రతశీలుని పుత్రులైన యిరువురు నుగ్రులు ధనుర్బాణ తూణీరధరులై సభకువచ్చి కూరుచుండిరి.

అపుడు మంత్రి వ్రతశీలునింజూచి రాజోత్తమా! మాచక్రవర్తికి మీవంటి రాజులందఱును గప్పంబు గట్టుచుండఁ దాము మాత్రము చెల్లింపకుండుటకుఁ గారణం బేమి? అని యడిగెను. రాజు అధికోత్సాహముతో, మంత్రివరా! చక్రవర్తికిఁ గారణం బెఱుంగ శక్తిలేకుండిన నుండవచ్చునుగాని నీయట్టి మంత్రి కడిగోచరం బెకదా. అయినను జెప్ప వలయునని యడుగుటం జేసి చెప్పెద గమనింపుము. మీ చక్రవర్తికిఁ గప్పంబు గట్టువారలు అలతిరాజులు. వారితో సరిసమానంబుగా మమ్ము లం గట్టమనుట పాడియే. దాక్షిణ్యమునకై కట్టితిమిపో; ఆ యల్పులు మమ్ము మదింతురా? కీర్తి ప్రతాప వైభవంబుల నాయట్టి వాఁడెవఁడు? ఇదో చూచితిరా? వీరు నాపుత్రులు. వీరి సామర్థ్యమును వర్ణింప నాదిశేషునకు నలవి గాదు. ఇక మీచక్రవర్తిమాటఁ జెప్పనేల? మేము కావలెననిన మీదేశంబును గొల్లగొట్టఁ గలవారము. మీ చక్రవర్తిని సహా యూరినుండి వెడలఁద్రోబ్బఁగలము. అయిన నితరరాజులు మిమ్ము లక్ష్యపెట్టరని యభిమానించి సహించియున్నవారము. కనుక మీచక్రవర్తికి మా సామర్థ్యంబుల నెఱింగించి, మీ దేశంబును భద్రంబుగా నుంచుకొనుటకై మాతో సంధిచేసికొనుడు. అదియ మీకు మేలు.

ఇకపై నెవరైన నిటవచ్చి కప్పమడిగినవారికి యమపురంబు తప్పదని విప్పి చెప్పుము. ఈ తూరి మన్నించితిమి అనియె.

ఆ మాటలను విని మంత్రి యచ్చెరువంది, వింత వింతయని యెన్నుకొనుచు తన సేనలతోడఁ దన దేశంబున కేగెను. చక్రవర్తి యీ సమాచారంబుల నెఱుంగనివాఁడగుటచేత మంత్రినిఁగని అయ్యా! శాంతపురికి తాము పోయివచ్చినసంగతి యేమైనది. ఆరాజ్యము సుభిక్షమా; దుర్భిక్షమా? వ్రతశీలుఁడు కప్పంబుగట్టుటకు నేమనుచున్న వాఁడు అని యడిగెను. అందులకు మంత్రి సార్వభౌమా! శాంతపురి యందుఁ జక్కఁగా వానలుగురిసి పంట పైరులెక్క సుభిక్షమై యున్నది. అనావృష్టిగాని యతివృష్టిగాని యితర యీతిబాధలుగాని యీ రాజ్యంబునకు లేదు అనియె. అటులైన మనకు గప్పమేల గట్టడు అని చక్రవర్తి యడిగెను. స్వామీ! యాకారణంబు చెప్పుటకు నాలుక రాకయున్నది. చెప్పినను మీరు నమ్మరు. అయినను దాము నన్ను బంపినపనికి నే విన్నంత కన్నంత యెఱింగించెదను. విన్నపంబాలకింపుడు. రాజేంద్రా! ఆవ్రతశీలుని దేవరవారు కప్ప మడుగకుండిరేని వాఁడేవియు మిమ్ముఁ జేయజాలఁడట. అతిక్రమించి యడిగిన దాను జక్రవర్తియగునఁట. కనుక నెల్లువ రాకమునుపే యనవేయుట మంచిది. అతని వింశతి పుత్రులును ధనుర్వేద పారంగతులు. వారిని ననాయాసంబుగా జయింప రాదు. మనమే నేఁడునఁబోయి యుద్ధంబు చేసితిమేని వారెటులనైనను జయించి కొందురు. కనుకఁ దాము తమ యేలుబడికి లోఁబడిన రాజుల నందఱిని రాఁపించి, యేకకాలంబున వానిపై యుద్ధంబునకుఁ బంపినయెడ నెంత బలముండినను దిగ్భ్రమ నొంది తమ ప్రాణములఁ గాచికొనుటకై పఱువెత్తి పోవుదురు. ఆసమయంబున మన మానగరంబున కేగి యందు నుత్తమ గుణవంతుఁడగు నొకని నేరువఱచి గౌరవంబును దక్కించుకొన నగును. రాజులెపుడు నిజబలము, పరబలము, కాలబలములగు నీమూటి నెఱింగియే యనుసరింపవలయును.

అని మంత్రి చెప్పినదే రాజు కొంత యోచించి, మంత్రీ! నీవు వచించిన మాటలను నిరాకరింపను. అయినను వాఁడట్టి ధైర్యవంతుఁడని

తామెట్లుజేయింగితిరి. అని యడిగెను. సార్వభౌమా! ఎవరికిని నెచట నెపుడును ధైర్యమే సర్వార్థ సాధకంబైనది. ధైర్యంబు గలవారు యుద్ధంబునకు వెనుకంజవేయరు. వారిని మనము సమయోచితంబుగా జయింపవలయును. అటుగాక సమయముదొరకనిమ్ము. చూచుకొందమనినది సరిగాదు. కనుక నిప్పుడే యుద్ధంబునకు సిద్ధంబుకమ్ము అని చెప్పెను.

ఆమాటలనువిని, చక్రవర్తి యచ్చెరువంది చెప్పుచున్నాడు. మంత్రిశేఖరా! నీవు వచించినది నిక్కమే.

గంధవతి.

తనకధిక బుద్ధి యుండినంగాని వేఱొకరి।తగుబుద్ధి వినంగవలయుం
దానధిక శూరుండై తగుచున్న వెంబడిని।దళములను జేర్చవలయుఁ
ఘనతంగలవిద్వాంసుండైనతను మించంగల।కవి జనుల కణఁగవలయుం
గాశ్యపినినొకఛత్రముననేలు వాఁడయ్యు।గరువంపుమంత్రివలయుఁ
వినందగిన సంగీత సాహిత్య పరుండైన।వెలయు సుతికాండు వలయుఁ
వెలుగంగలదివ్యమైననుజక్కనెగదోయి।వెలుగుటకుంబుల్లవలయుం
బెనుపాపకనణంబు దినువారువముతౌత।వెన్నంటు లవలిమగండా
ప్రియమైన నాకోర్కులనుదీర్చి తనికాద్రి।శ్రీమించు కొమరుసామీ.

అని మహాత్ములు వచించియుండు శాస్త్రప్రకారము ఎవరైనను తనకెంత సూక్ష్మబుద్ధి యుండినను ఇతరుల బుద్ధిని విని తాను నడువవలయును. కనుక ఆగాముల వచించుట మంత్రి ధర్మమను న్యాయ ప్రకారము, నగళ్ళయందు మంత్రుల యొకరొకరి యుక్తితంత్రంబుల నిదానించియే రాజులు రాజ్యపరిపాలనంబు సేయుచుండుదురు. అదియునుం గాక దశరథుండు, ధర్మరాజు మొదలగువారు నట్టులనే మంత్రుల సహాయంబుచే రాచఱికంబు సేసి నొప్పువడసిరని పురాణంబుల వినుచున్న వారము.

కనుక నేనును ఆప్రకారమే మీ యాలోచనప్రకారమే రాచతికంబు చేయుచుండుటచేత నాకెట్టిభయంబునులేదు. అమాత్యశేఖరా? మీ యిచ్చమేఱకు నడిపింతురు గాక యనియె. అదివిని మంత్రి సంతసించి, సార్వభౌమా! మనము కప్పము వానికడఁ దీయకయుందుమేని వానికి మనము భయంబునొంది యడంగి యున్నవారమని తలంచుకొని, మనపై యుద్ధంబుసేయ వాఁడువచ్చునేని యితర సకలదేశాధిపతులును వాని పక్షమునఁ జేరి మనల నెదిరింపఁ జనుదెంతురు. అటులంగాక మునుపే మనము ముందుజాగ్రతతో నుండవలయును. అందులకోసరమే యేదైనను బ్రయత్నంబుసేసి యుద్ధంబు సలిపి మనమందు జయించి, పరునిరాజ్యమును గైకొనవలయునని నుడివెను. అదివిని చక్రవర్తియు సమ్మతించెను. సకల దేశాధీశులకుఁ గమ్మ వ్రాసిపంపుఁడు. అందఱును వచ్చి మూగిన వెనుక, వ్రతశీలు నెదిర్చి వాని శాంతపురంబును గ్రహింపుడని ముదల యిచ్చెను.

మదనవల్లి:—అక్కా! ఆవ్రతశీలుని నిరువదిపుత్రులకు నిరువది దేశముల రాజపుత్రికలను దెచ్చి పెండ్లి చేయించి యుండునుగదా.

మనోరమ:—చెల్లెలా! ఆవ్రతశీలుఁడు తనపుత్రులకు తన సమానులగు రాజుల కుమార్తెలందెచ్చి పెండ్లి చేయలేదు. "చేతుల నిండిన బంగారంబు కంటె కంటికింపైనది మేలని" తలంచి, తన దేశంబున నుండు రూపరేఖా విలాసంబులంగల ఉత్తమ కుల స్త్రీలను నేరితెచ్చి తనపుత్రు లిరువదుండ్రకు బెండ్లిచేసిపెట్టెను, అందువలన వీని కేరాజును బంధువుగాఁడు.

కనుక, తనమంత్రి చెప్పినట్లే చక్రవర్తియు సమ్మతించి దూతల యొద్ద బత్రికలవ్రాసి పంపి, సకల దేశాధీశులను వేఱువేఱుగా రమ్మనునటులఁ జెప్పి పంపెను.

ఆ మాటలను వినిన దూతలును రాజు నుత్తరువు మేరకు సకల దేశంబుల కేగి ఆయా దేశాధిపతులయొద్దఁ బత్రికల నిచ్చి చక్రవర్తి

చెప్పిన విధంబును దెలియఁ బఱచిరి. దేశాధిపతులును ఏలయో యేమి యోయని సందియంబు నొంది, తమ మంత్రులకుఁజెప్పి సేనాసమేతులై చక్రవర్తి నగరంబునకు వచ్చిరి. అపుడు చక్రవర్తి వారలనుజూచి, నా ప్రాణపదంపు నేస్తులారా! మీరందఱును మన సేనలతోడ శాంత పురంబున కేగి వ్రతశీలునితోఁ గయ్యంబు సలిపి, వానిని జయించి వత్తు రని గోరెదను అని చెప్పెను.

ఆ రాజులకును వ్రతశీలునిపై ద్వేషంబుకలిగియుండుటచేత మఱి నుప్పొంగి చక్రవర్తి కిట్లనిరి. సార్వభౌమా! మేము నిదివఱకే వానిని జయించి, వాని కనేకదుఃఖంబులంగల్పించి, చంపవలయుననియే తీర్మా నించికొని యుంటిమి. అయినను తమకెట్టి కోపంబువచ్చునో యని య డంగి యుంటిమి. అదియునుం గాక మేమొకరొకరమే యావ్రతశీలుని తోఁబోరి జయింప వలనుగాదు. ఏల నంటిరేని వాని కొడుకు లిరువ దుండ్రు మహావీరులు. వారికడ మితిలేని సేనలున్నవి. తమకుఁ జెల్లిం చుకప్పమును రాణువవీరుల కొసంగి, వారల కందఱికిని యుద్ధాభ్యా సంబులఁగఱపుచుఁ దమ సార్వభౌమత్వమును దాగ్రహింపవలయునను దుష్టయోచనం గలిగియున్నవాఁడు అని చక్రవర్తి మనంబును బహు విధంబులం గలంచి, యుద్ధప్రయత్నంబులకుఁ బురికొలిపిరి.

ఆ మాటలను విని చక్రవర్తియు "మేలు మేలు! వానికిట్టి దురా లోచన కలదా? మంచిది. వానిని గట్టపఱచియైనను నాదేశంబువిడిచి వాఁడు పఱునెత్తునట్టులఁ జేసితిరేని నా శాంతపురంబును మీకు నిచ్చి వేసెదను. మీరలు దానిని భాగించి యెత్తుకొని యందు రాఁగలకప్ప మును నాకియ్యక మీరే యనుభవించుకొనుఁడు." అని యుత్తరవొసం గెను. దేశాధిపతుల కా మాటలు ఱెట్టైవిఱిగి నేతిని బడినట్లుండెను. అట్టులన కానిండని సమ్మతించిరి. రాజులు తమతమ దేశంబుల కేగి రా జ్యంబుల మంత్రుల కప్పగించి, సేనాపతులకుఁ దమ యిష్టం బెఱిం గించి, యాక్షణమే సకల సేనలను బిలుచుకొని యుద్ధసన్నద్ధులుకండని యానతిచ్చిరి. సేనాధిపతులును తమతమ యేలికల ముడలమేఱకు రథ

గజతురగ పదాతులతో చక్రవర్తి కడకు వచ్చిరి. వీరి సేనల మొత్త మునుగనిన చక్రవర్తికి మనంబు చలించెను. ఔరౌర యిదేమి వింత? వీరందఱును మనపై యుద్ధంబునకు వచ్చినను, మనమీ రాజ్యమును వదలి యెక్కడికైనఁ బాఱిపోవలసి వచ్చును గదా యని తీర్మానించుకొని ధైర్యంబు విడనాడి యుండెను. దేశాధిపతులు తమసేనల నొకచోట నిలిపి, రాజులుమాత్రము ఒకటిగాఁ జేరి చక్రవర్తికడకుఁబోయి మహా ప్రభూ! మేము నేటిదినమే శాంతిపురికేగి యానగరంబును కొల్లగొని వ్రతశీలుని జయించివచ్చెదమనినుడివిరి. అదివిని చక్రవర్తి "ధర్మమార్గ నిరతులగు రాజులారా?" రాజుచేసిన దోషంబునకై కాపులను బాధించుట న్యాయంబు గాదు. మీర లిటనుండిపోయి యావ్రతశీలుని వాని పుత్రవింశతిని, మఱియు వారికి సహాయులై వచ్చువారినందఱినిజయించి యానగరంబున మీరొక్కరొక్కరును ప్రతినిధులనియమించి, యందు రాఁగల లాభంబును మీరే యనుభవించుకొనుడు అనెను. అదివిని రాజులందఱు నట్టులనకానిండని సమ్మతి నొంది తమతమ సేనలతో శాంతిపురికై వచ్చిరి.

ఇట వ్రతశీలుఁడు చక్రవర్తికి దాను మును ముందు తెలిపిన యుద్ధ కారణంబును బురస్కరించుకొని, "జయాపజయంబు లెవరికిసొంతము. మనము జయించితిమేని సకలదేశంబులకు చక్రవర్తిగాగలము. సుఖంబు పడయఁగలము. అట్లుగాక చక్రవర్తికి జయమగునేని, మనకుండ నివాసమేది? యని యోచించెను." తన యభిప్రాయంబును గొడుకులకుఁ జెప్పెను. వార లొక్కరొక్కరు తమతమ సామర్థ్యంబులకుఁదగినటుల "తండ్రీ! యుద్ధంబునఁ బ్రవేశించినపుడు జీవితమును గాపాడికొని లోకసుఖంబును నిచ్చగొనుట న్యాయమగునే!" మనము శౌర్యావేశంబుతో నెదిరివానితో జగడంబుచేసి, జయంబు నొందిన యెడల, సకల దేశంబులకును ఏకచ్ఛత్రాధిపత్యంబు పడయఁగలము. లేక మనము యుద్ధంబుచేసి చచ్చితిమేని స్వర్గపదంబు నందుదుమని చెప్పిరి.

ఆ మాటలను విని సౌందర్యవల్లి యిట్లనుచున్నది. తండ్రీ! నా సహోదరులు చెప్పెడిమాటలు నాకు రుచింపవు. ఏలనంటిరేని వినుడు,

సామ బేధ దానదండంబులను చతుర్విధోపాయంబులచే శత్రురాజులను మనము జయింపవలయును. అనినను వెల్లువరాకమునుపే యనకట్టుటం బోలె ముందు జాగ్రతగా నుండుటయే శ్రేష్ఠమార్గం బగును. కనుక మన నగరినుండి మనుష్యసంచారంబులేని యరణ్యాంబునఱకు పాతాళంబున సొరంగ మొకటి చేసి పెట్టికొని యుంటిమేని, శత్రువుల బలాబలంబుల నెఱింగి, తనబలమును, కాలబలమును, శత్రుబలము నీ మూటిని యోచించికొని, దాని ననుసరించుట వొడ్డది. మనకు యుద్ధంబుచేయ శక్తిలేని పక్షమున మనము బొక్కసంబునుమాత్ర మెత్తుకొని సొరంగ మార్గమున నడవుల కేగి యటనుండి యొకదీవి కేగి యట సుఖానందులమై యుండవచ్చును. పిదప మనకు మంచికాలము వచ్చునేని శత్రువుల నెదిరించి భయములేక మనదేశంబును మనములకైకొనుట యుత్తమోత్తమ మార్గము.

అయిదేండ్ల ప్రాయంబుగల తన కూతురుగు సౌందర్యవల్లి చెప్పినది వినిన వ్రతశీలుం డచ్చెరువంది, ఔరా! ఈమనబిడ్డ లిరువదుండ్రు తమ తమ భార్యా పుత్రులతో సుఖానందులై యుండుటయే గాక సకల శాస్త్ర పురాణంబులం జక్కగాం జదివి యున్నవారు. అటులుండియు వీరికి యుద్ధక్రమ మిట్టిదని తెలియక యున్నది. మన కుమార్తెకు వయసు ఐదైనను, యోచన యధికంబై యున్నది. కనుక నీమె యిచ్చు మేరకు మనము చేయుటయే మేలని యోచించెను. తన బిడ్డం జూచి, అమ్మా! సౌందర్యవల్లీ! నీయన్నలు యుద్ధంబునజయించితిమేని మనకు భూలోకంబును, చచ్చితిమేని దేవలోకంబును గలదని ముష్కర వచనంబు లాడుచున్నవారు. నాకు నది సమ్మతియే లేదు. నీవు వచించునదియే న్యాయంబుగనున్నది, కనుక నీ యిష్టప్రకారమే నడచుకొనుట యపాయంబు లేని యుపాయంబు అని చెప్పెను.

పదంపడి వ్రతశీలమహారాజు ఆ నగరంబునుండు శిల్ప శాస్త్రజ్ఞుల రావించి, వారికిం బసడనంబుల నొసంగి, తన నగరునుండి నూఱామడల వఱకు నొక సొరంగము త్రవ్వి యడవియందొకమూల గలు

పురు ద్వారంబు నమస్తరు గాకయని సెలవిచ్చెను. ఆశిల్పులు నేదియుఁ వెలియనివారగుటచేత, రాజాజ్ఞప్రకారము చేసి ముగించి యిచ్చితిమేని మనకు ద్రవ్యసహాయంబు చేయగలరని తీర్మానించి పదునైదు దినములలో నన్నియు ముగించి రాజున కెఱింగించిరి. రాజు వారిని బహూకరించి పంపెను. ప్రతశీలుండు తన పుత్రిచెప్పిన తంత్రప్రకారము సొరంగము త్రవ్వబడియుండు వినోదంబును జూచి ఆశ్చర్యమంది, తన బొక్కసమున నుండు ద్రవ్యంబులను, వస్త్రాభరణంబులను, నవరత్నములను నెత్తి యిరువది రెండు మూటలుగాఁ గట్టి సిద్ధంబుగా గుహాద్వారంబు కడ నుంచెను. తన రథగజ తురగ పదాతి సేనలను కోటకు నలుప్రక్కల పద్మ వ్యూహముగా నగరు చుట్టును [stamp] ల నుత్తరవిచ్చి యుద్ధ సన్నద్ధుండై యుండెను.




చక్రవర్తి యానతిమేఱకు సకలదేశాధీశులు [stamp] కాలంబున సముద్రంబు పొంగి వచ్చునటుల, ఓ యను ఘోషంబుతో శాంతిపురికోటకు నలుప్రక్కల ఎనుబది యామడలకు సరిగా నిలిచి చుట్టిరి. వీరలు బయలుదేఱి వచ్చునపుడు చక్రవర్తి యూరివారిని దోంచెవు చేయ వలదని చెప్పి యుండుటచే నా యాపదనుండి యూరివారు తప్పిరి. లేనియెడ నదివఱకే యా నగరస్థులు "గాలియందుఁ దగిలిన బూరుగ దూదివలెను, ఏనుగులకాళ్ళ త్రొక్కుళ్ళంబడిన కప్పల వడువునను" జెల్లా చెదరై యుందురు. చక్రవర్తి యంతటి యుదారగుణుండెవ్వడు? ఈ సేనలంగనిన నగరవాసులు భయంబునొంది వారి వారి యిండ్లకేగి, తలుపుల మూసికొని తాళంబిడుకొను వారుగను, మిద్దె మేడలపై దాగు వారుగను, నుప్పరిగల నెక్కి సేనాబాహుళ్యమును జూచువారుగా నుండిరి. మఱికొందఱు ధనుర్బాణతూణీరధరులై మనయిండ్లకువచ్చినం జూచికొందమని ధైర్యంబున నిలిచి యుండిరి.

శాంతిపురి సేనావీరులును సమయ మెట్టుల నుండునో యెవరి కుంగుదురని దిగులంది కోటచుట్టు పద్మవ్యూహంబుగా నిలిచియుండిరి. ఈ యద్భుత దర్శనంబునం గోట బురుజులనెక్కి చూచుచుండిన ప్రత

శీలుండును, వాని కొడుకులును దిగులందిరి.? ఔరౌర! యిదియేమివింత! యుద్ధంబు సేయుట యన నొకడొకనితో పోరాడినయెడల సామర్థ్యము తెలియును. అటుగాక ఒక దేశంబుపై ననేకదేశంబులు పొరలివచ్చుట యన నెట్టిది. వీరలు దుర్మార్గులు. వీరి జోలి మనకేల, మన సౌందర్య వల్లి చెప్పిన విధంబుగాఁ జేయకుంటిమేని మన మందఱమును నేడే బలి కావలసి వచ్చును. లోకంబుపై వాంఛ యపుడే తొలంగి యుండును. అటుగాక మన ప్రాణములు పోయినను బోనిమ్ము. వీరికి మనసామర్థ్యం బులు చూపవలయునని యనుకొంటిమో? అది సరివచ్చునది గాదు. పులి యెంత సామర్థ్యముగలదియై యుండినను లెక్కలేని పసువులు వచ్చి పొడిచిన నేమిచేయును. దానిసందునఁ దగులుకొని ప్రాణంబులు కోలుపోవును. సామర్థ్య మట్టిచోటఁ దెలియునా? వీరు చెడిరి. వీరితో యుద్ధంబు సేయువాఁడు మూఢుడేకాని సామర్థ్యవంతుఁడై యుండఁడు. ఛీ! ఛీ! వీరివంటి యల్పులే వీరితో యుద్ధంబు సేయవలయును, అని గొల్లున నగిరి. అయిదేండ్ల ప్రాయంబుగల సౌందర్యవల్లి బుద్ధికుశలతకు మెచ్చుకొనుచుండిరి.

ఇంతలో నెదిరి సేనలు కోటను దగ్గరించె . కోటకు జుట్టియున్న యుద్ధవీరులు భ్రమచెంది, పిశాచకూటంబులఁ గనినవారివలె, మాటలు తడబడ చేతులు సోల, మైమఱచి కండ్లు మూదులుగప్పఁ జేయునదిలేక గుప్పు గుప్పునఁ గ్రింది కొఱిగిరి. అదిచూచి శత్రువులు అట్టహాసంబు చేసి, వారి చేతులందలి యస్త్రశస్త్రంబులఁబుచ్చికొని, నిరాయుధులం జేసి, వారి నొకచోటఁ గూర్చుండఁ బెట్టిరి. ఆ గోడునుజూచిన యబ్బ కొడుకులు అవమానమందిరి. అమ్మా! నీవుపసిబిడ్డవైనను, బుద్ధియందుఁ బెద్దదానవే. ముందు మేము మా తల్లి గర్భమున జనించితిమి. ఇపుడు మే మందఱమును నీ కడుపున బుట్టిన వారమైతిమి. మాకు రాఁగల యపాయంబును దెలిసికొని, మునుమున్న యందులకుఁ బరిహాసంబును గల్పించి యిచ్చితివి. మేము మగవార మన్న మాటయేకాని నీవే మా కన్న మిన్నవు. అని మెచ్చుకొనిరి. తా మిదివఱకు సిద్ధముచేసియుంచిన

మాటల నెత్తుకొని తన బంధు వర్గములతో నా వ్రతశీలుఁడు సురంగ మార్గముగా నెవరి కంటికిఁ గనబడక పోయెను.

అంతట శత్రురాజు లొక్కటిగాఁ జేరి, శాంత పురికోట ననాయాసంబుగాఁ జొచ్చిరి. పోయిచూడ వ్రతశీలుఁడుగాని వాని కొడుకులు గాని మఱి యెవ్వరైనను లేక పాడుపడి యుండెను. బొక్కసంబును బరిశోధించిరి. అందొక్క చిల్లిగవ్వయైనను లేదు. ఇదేమి క్రొత్త వింతయై యున్నది. అని యచ్చెరువంది యచటనే నాలుగైదు దినంబులుండిరి. శత్రువులు లేని యింట నెవరుండరు?

సొరంగముగుండాఁ బోయిన వ్రతశీలుఁడును వాని కొడుకులు కూతురు భార్య, కోడండ్రు మనుమలు మనుమరాండ్రు తక్కుంగల చుట్టములు మొదలగువార లేబదుండ్రు మూఁడామడ లేగి యొక కాననంబున కేగిరి. అది మనుజ సంచారము లేనిదై భయంకరమై యుండెను. వారచట నుండు నొక తోపు దగ్గరఁ జేరి గుడిసెలెత్తుకొని వంటఁజేయ నారంభించిరి.

మదనవల్లి:—అక్కా! నీవు చెప్పినది విని యానందించితిని. అయినను వ్రతశీలుఁడును దక్కుంగలవా రేబదుండ్రు సురంగమార్గముగా మూఁడామడలదూరము వచ్చునపుడు వంటచేసి భుజింపక, యడవికి వచ్చిన వెనుక వంటచేసికొనిరన నెట్లు నమ్మునది? ఎంత వేగంబుగా వచ్చినను అయిదు దినములు పట్టదా? అంతవఱకు నోట నీరువోయక యుండిరా? వారికి ఆకలి బాధలు లేకుండెనా?

మనోరమ:—చెలీ! ఎవరికిని ఆకలిదప్పులు నిద్ర యివి మూఁడును నీడ వలె నుండునదే కాని వదలి యుండదు. దాని వలననే సుఖదుఃఖంబు లందుట యని యెఱుంగుము. వీ రేబదుండ్రు ముందుగనే చాలిన యన్నంబుల సిద్ధంబు చేసికొనియున్నవారుగాన దానితో నైదు దినంబులు కడదోసిరి. వారు సురంగమున నాఁకటిబాధలు

పడియుందురో యెవరి కెఱుక. వాని నంతయును బ్రస్తాపించుకొని యుండుట మేలుగాదని వదలితిని.

అది యటుండనిమ్ము. వ్రతశీలుఁడును అతని కొడుకులును ధనుర్ధరులై యడవుల కేగి, జింకలు, మొసళ్ళు, కొండగొఱియలు మొదలగు జంతువులను జంపి వాని మాంసంబుల నన్నింటిని దెచ్చియిచ్చిరి. అటనుండి యొక సెలయేటికరిగి యందు స్నానాదికృత్యంబుల నెఱవేర్చుకొని మంచిబట్టలం దొడిగికొని మనోల్లాసయుతులై వచ్చిరి.

వారలటకు రాకమునుపే స్త్రీలందఱును తాము పడగళ్ళనుండి తెచ్చిన బియ్యము మొదలగు సామగ్రులతో, వేటయాడి తెచ్చినమాంసంబును జేర్చి పొలవు, బ్రింజి, కిచ్చిడి, కుర్మా మొదలగునవి చేసి సిద్ధపఱచియుండిరి. అందఱొక్కటిగాఁగూర్చొని తనివిదీరఁ దినిరి. మనోల్లాసపరులై యుండిరి.

అపుడు సౌందర్యవల్లిని జేరంబిలిచి, అమ్మా! నీ యుక్తివాదంబున మేమందఱము బ్రతుకుగొంటిమి. ఇక మేము నడచుకొనవలసిన పద్ధతులను దెలియం జెప్పుము. మేము నట్టి పద్ధతినే యవలంబించి కృతకృత్యులమ్యెదము అని యడిగిరి. ఆమాటను విని సౌందర్యవల్లి కొంత నిదానంబుగ నాలోచించి యిట్లు లనియెను. తండ్రీ! మనమిక నిచ్చట నుండఁగూడదు. ఈ యడవినుండి యతితీవ్రముగా నడచి మన చక్రవర్తిగారికి లోబడని ద్వీపాంతరమున కేగుదము. అచట నొక దేశంబున మనము నొక నగరవాసినలై నుందము. మనశ్చాంచల్యంబు లేక మన యొద్దనుండు ద్రవ్యంబుల నుంచుకొని జీవించుచుందము. నాకుఁ బుత్రులెండ్రేండ్ల వయసు రానిమ్ము. అపుడు మీకు నేను సేనాధిపతినై మా యన్నలతోడ మనపై నొకతడవను వచ్చి యెదిరించిన శత్రురాజులతో యుద్ధంబుచేసి, యొకరొకరిదేశంబును బట్టుకొనుచు వచ్చి వారి వారిని మనకు గైవసులుగఁజేసికొని వారితోడ చక్రవర్తిని జయింపనగును.

సౌందర్యవల్లి చెప్పినమాటలను వినిన వ్రతశీలుఁడు అచ్చెరువందె, అమ్మా! నీ యిష్టంబు మేరకు నడచుకొనియెదము అని చలిదియన్నము మూటఁగట్టికొని యెత్తుకొని, యా యేబదుమంద్రుడును బాటసారులవలెనడచుటయు, ఆకలెత్తునపుడు తినుటయు, రాత్రివేళరాఁగా గుడారంబెత్తికొని యందు విశ్రమించుటయునుగాఁ బోవుచుండిరి. ఇంతు గొందఱు మేల్కొనియు గొందఱు నిద్రపోవుచు నుందురు.

అపుడు దుష్టమృగములైనను దొంగలైనను వచ్చినయెడల, వ్రతశీలుఁడు నతనిబిడ్డలును ధనుర్బాణతూణీరధరులై వానిబాధ నండిచెప్పింతురు. ఈరీతి నడవియంతయు దాటి యొక దీవికిఁబోయి, యచటనుండు నొక దేశంబునకేగి, యచట నైదువేలవరహాలకుఁ దోటలు భావులు తీసికొని విశాలమైన యొకయింటిని వెలకుఁబుచ్చుకొని, యీ యేబదుమంద్రు నచటఁ గాపురముండిరి.

శాంతపురికి యుద్ధంబు కేగినరాజు లందఱును అంతిపురంబునకేగి చూడఁగా, నచట వ్రతశీలుఁడును, అతని భార్యయు బిడ్డలును లేకుంటచేత నచ్చెరువంది, చక్రవర్తికిఁ దెలియఁ జఱచిరి. చక్రవర్తియు నిదేమి బూమెగా నున్నది యని యెంచుకొని శాంతిపురికి వచ్చెను. అంతఃపురమంతయు వెదుక నారంభించెను. వెదుకునపుడు అంతఃపురంబున నొకప్రక్కను సొరంగమార్గము కనంబడెను. ఔరా! ఏమిసాహసంబున కేమన వచ్చును. రాజులారా! శాంతిపురి యేలిక యగువ్రతశీలుఁడు మిగులఁ దంత్రంబు గలవాఁడు. మన సేనలనుఁ జూచి దెకగులొంది యీ సురంగమార్గముగాఁ బోయియున్నవాఁడు కాఁబోలును. కనుక మనమీ సురంగమార్గముగాఁ బోతిమేని వాఁడును వాని బిడ్డలును కనఁబడుదురు. వారి నచటనే యపుడే చంపక ఖైదిగాఁ గొని తేగలము. వారిని విచారించి యొక్కొక రాజ్యాంగమునందును వారలను బానిసలవలెఁగనును, కష్టము లైనపనుల నిప్పించుచు, కడుపునకు జాలని జీతంబులనిచ్చి బాధింపవచ్చును. అపుడే వారిని బరిహసించువు నుండనగునని చెప్పెను. అందఱును సమ్మతించిరి. సురంగమార్గముగా సందఱు జయులు దేరి.

వార లెంతదూరము నడచినను ద్రోవ సాగినది కాదు. వార లచ్చెరువందిరి యీ సురంగ మెంతదూరముపోవునో చూచెదమని పోవుచుండిరి. వారి కాకలి యెత్తినపుడు భక్ష్యంబులఁ దినుచు నిద్రవచ్చినపుడు సురంగముననే నిదురించుచు నిటుల నైదు దినంబులకా సురంగమునుదాటి యడవికి వచ్చిరి. వ్రతశీలుఁడు తన కుటుంబము వారితో భుజించిన తావును జూచి యాశ్చర్యపడిరి. వారి చేతులకు సందులు కట్టుపుట్ట నవ్విరి.

అంతటఁ జక్రవర్తి సామంతులంజూచి, రాజులారా! ఈ వ్రతశీలుఁడు మహా తంత్రశాలి. వీఁడు తనకుండిన మనోగర్వంబుచే మనలఁ జులకనగా దలంచినాఁడు. మన సేనా బాహుళ్యమును భయంబునొంది పఱువెత్తిపోయెను. ఛీ! ఛీ! వాఁడు శూరుఁడా! వాఁడు చెడినాఁడు. దుర్మార్గుఁడు అయినను ఇట్టి గర్వపోతై యుండుటచేత వీనిని నూఱక విడువఁదగదు. ఎటులనైనను వెతకి పట్టి తెత్తురని కోరెదనని సామంతులకు జెప్పి యా సురంగమార్గముగానే చక్రవర్తి శాంతిపురి అంతఃపురంబునకుఁ బోయెను. తక్కినవారును జక్రవర్తితోడ అంతిపురంబునకు వచ్చి యచట నాలుగైదు దినములు భుజింపుచుఁ ద్రావుచుఁ సుఖగోష్ఠినుండిరి. చక్రవర్తియుఁ దాను ముందు చెప్పినవిధంబుననే యందఱి రాజులకును ఆ పురంబును విభజించి యిచ్చెను. వ్రతశీలుఁ డెచ్చటనుండినను బట్టితెచ్చుట మీ భారమని యాజ్ఞాపించి చక్రవర్తి తన రాజధానికేగెను. పిమ్మట నందఱును జక్రవర్తి చెప్పిన విధంబుననే యొక్కొక రాజును నా శాంతపురియందు నొక ప్రతినిధినుంచి, వారివారి దేశంబులకు వారువా రేగిరి. ఆ శాంతపురియందు వచ్చు పన్నులను అంశలును విభజించుకొని, చక్రవర్తికిని గొంత పంపుచుండిరి.

ఇటుల నాలుగైదుసంవత్సరములు గడచెను. పిదప సకలదేశాధీశులును శాంతపురిని వృద్ధి పఱుపవలయునని యెంచి, నగరమునకు నలుప్రక్కలను తొంబది మైళ్ళదూరము నలుకుఁ గల యడవులనుగొట్టి సమతలచి, నాగరికులుండుటకు దగిన మిద్దె మేడల గుడి గోపురంబు

లను గట్టించి, వీథుల నేరుపఱచి, యందు నగరవాసుల గాపురము కుదురునటుల జేసిరి. ప్రాతయిండ్లనుగొట్టి యా స్థలంబున నొక్కొక రాజున కొక్కొక కోటవంతునఁ గట్టునట్లు శిల్పుల కుత్తరవిచ్చి తగుధ నంబుల నొసంగిరి.

ఆ శిల్పులు నొకరికన్న నొకరు పేరెత్తవలయుననునాసచే తాము నేర్చిన శిల్పముల నన్నింటిని నుపయోగపఱచి దేవ రాజధానియో యని చూపఱు లనుకొనునట్లుఁ గట్టిరి. ఒక్కొక కోటకుఁ జుట్టును, మల్లెలు, మొల్లలు, ఇరువాతులు, చంపకములు, జాజులు మొదలగు వాసన పూలచెట్లను అమరి యుండును. అచటచట వసంతమండపములు జల క్రీడా మండపములును కనుల పండువై యుండును. పూలచెట్లయంద మకరందమునుద్రావి మనముప్పొంగి ఝుంకారశబ్దంబు లొసంగు భ రంబులు శ్రుతికాంద్రముగను సంగీత సాహిత్యములయందు నాఱితే ఘునపాటకులవలె నెమళ్ళు కోకిలలు కూయ నా పురంబొప్పుచుండు. దీని విలాసంబును జూచి యాయాదేశపు రాజులు తమతమ శిల్పులకు బహుమానంబుల నొసంగి పంపిరి.

పిదప నారాజులు ఒక్కటిగా జేరి యుండుటకై విస్తారమైనమేడ యొకటి యందఱును నొకటిగా సెలవుచేసి కట్టించిరి. అందు సకలరాజు లును మహా వైభవంబుతో వచ్చిచేరిరి. వారొకరినొకరు చూచుకొని రాజులారా! మనమొకనాటికి మన చక్రవర్తిని నిచటికిరప్పించి, విందు సేయవలయునని చెప్పుకొనిరి. దూతలను జక్రవర్తి కడకు బంపిరి.

అటఁ జక్రవర్తి తన మంత్రి ప్రధానులతో గొలువుండి మనో ల్లాసంబుగా సంభాషించుకొనుచుండెను. శాంతపురివృత్తాంతము ప్రసంగ వశమున వచ్చెను. అపుడు రాజులుపంపినదూతలు చక్రవర్తికి నమస్క రించి తమ యేలికలు చెప్పిపంపిన వృత్తాంతమును నివేదించిరి. చక్ర వర్తి యదివిని, సరి! అట్టులనే వచ్చెదనని చెప్పిపంపి, తన మంత్రిప్రధా నులతో, రథగజతురగ పదాతిసేనలతో మనోల్లాసంబుగా శాంతపురికి వచ్చెను.

చక్రవర్తి రాక నెఱింగిన సకలరాజులును పఱువెత్తివచ్చి చక్రవర్తికి వందనాదికంబుల నొనరించి పిలుచుకొనివచ్చి, యందఱికిం బొడవైన యేకాంతమగు మేడయందు సుఖాసీనుం జేసిరి. చక్రవర్తికి పుష్పమాలికల నలంకరించిరి. దగ్గఱం గూర్చొని యతి వినోద వచనంబుల నాడుచుండిరి. అపుడు స్వయంపాకులు అన్నాదుల సిద్ధంబుచేసి యా సమాచారమందిచ్చిరి.

చక్రవర్తియు సామంతులందఱును స్నానాదివిధులను దీర్చికొని, శుద్ధ వస్త్రాలంకృతులై, భోజనశాలకేగి తగినపీఠంబులం గూరుచుండిరి. స్వయంపాకులు వారలకు పరటియాకులు వేసి, పొలవు, బ్రింజి,కిచ్చిడి, రుమా మొదలగు పన్నంబుల బదార్థంబులవడ్డించి, పాత్రంబుల మధు నించి, జింక,కుందేలు, కొండగొఱియ మొదలగు జంతువులమాం బులను బక్వంబు చేసి యుంచిరి. వీని నన్నింటిని జూచిన చక్రవర్తి దినుప్పొంగి, ఔరౌర! ఈ సామంతులందఱును శ్రేష్ఠులగుటచేత, మన గౌరవమునకుం దగినటుల గారవించిరి. మర్యాదస్థులగుటచే మనతోం దులదూగుచున్నవారు. వీ రొకరొకరు సహోదరులవలె నున్నవారు. ఆ వ్రతశీలుఁడో కౄరస్వభావుఁడు. మహాగర్వి. అట్లగుటచేత వీరినెల్ల పగచేసికొన్నవాఁడు. అంతటితో నుండక మనల నెదరింపం బ్రయత్నించెను. మన సార్వభౌమత్వము హరింప నెంచెను. వాని దుర్గుణమే వానికి కీడుచేసెను. యాచకుడై తిఱుగులాడ జేసినది వానిగర్వమే కదా యని యెంచుకొనుచు మధుమాంసంబులతో నారగించెను. అందఱును నారగించి లేచిరి. నవరత్న ఖచితమైన సింహాసనంబుపై రాజు అధిష్ఠించెను. సామంతులు తగుచోట్ల గూరుచుండిరి. ఆటకచ్చేరి పాటకచ్చేరులు మహానందంబుగా జరిగెను. అందఱును ఆనంద కందళిత హృదయారవిందులై యుండిరి. అపుడు సౌందర్యవతులగు కన్యలు తమ్ములంబులందెచ్చి మడిచి యిచ్చుచు, పునుగు, జవ్వాది, కస్తూరి, పన్నీరు మొదలగు వాసనలను చక్రవర్తిపైం బూసిరి. కొందఱు పూలమాలికలు వేసిరి. మఱియు నుండగలవారు తమ యిచ్చమేరకు నాడుచుండిరి.

ఇటుల పగలు ఇరువది గడియల వఱకు నందఱును వేడుకలను బొగ్గుపుచ్చుచుండ నటనస్త్రీలు కొందఱు నాట్యంబు సేయుచుండిరి. మఱి కొందఱు ఆటలంబాటలను బ్రొద్దుపుచ్చుచుండిరి. మల్లురుకొందఱు మల్ల యుద్ధంబు చేసిరి. ఇట్టి వినోదంబులచే ముప్పది గడియలు చెల్లెను. చక్రవర్తి రాజులతోడ ఫలాహారంబుల భక్షించి, మనోల్లాసపరులై యుండిరి. పిదప రాజులందఱును వస్త్ర మాల్యాభరణా లంకృతులై, చక్రవర్తికి నలంకరించి, యొక యేనుగుపై నెక్కించి తా మందఱును గుఱ్ఱంబులపై నెక్కి కోటచుట్టు నూరేగిరి. అపుడు చక్రవర్తి యొక్కొక రాజు యొక్క కోటను, వానియందు నవరత్నములు చెక్కి చిత్రపుబనుల జేసి యుండుటయు, దానికిదగినటుల బాణవినోదంబుల జరిపించుటయు, మత్తాబు వెలుతురున నా యాకోటలు ప్రకాశించు ప్రకారమును, జూచి యచ్చెరువంది, రాజులారా! ఇదేమి? యీ శాంతపురియంతయుం గోటలుగనే కట్టి విడిచితిరే ఈ నగరస్థు లెచట నున్నవారని యడిగెను.

అదివిని రాజులు మందహాసంబు చేసి మహాప్రభూ! మన నగర వాసులకు మేము ఎట్టి కొఱతయును జేయలేదు. అయిదేండ్లుగా నీ శాంతపురియందు మాకు లభించిన ద్రవ్యంబున మీకుం బంపినదిపోను మిగత ద్రవ్యమును మా బొక్కసంబుల నుండుద్రవ్యంబును వెలపుచేసి యిట్టి యద్భుతంబులకు నెలవగు కోటలను గట్టించి, యరణ్యంబుల దిద్ది పట్టణంబు చేసి యది వాసయోగ్యంబగునట్లు మిద్దెలమేడలం గోటలను గట్టి పెట్టితిమి. మీ రటకువచ్చి చూడవలయునని విజ్ఞప్తి చేసి కొనిరి. అట కందఱును బోయి మైదారు దినంబులు వేడుకలు మీఱ నుల్లాసంబున నుండిరి.

ఇటుల నుండునపు డొకదినము సామంతరాజులు చక్రవర్తితోడ మనోల్లాసంబుగా నందఱికింబోదువగు నేకాంతభవనంబున నుండునపుడు చక్రవర్తి యిట్లనియె. రాజులారా! మీరలు నామనంబునకుం బ్రియులై యుండుటచే, మీకు సకల సంపత్తులు చేకూఱినవి ఆ వ్రతశీలుండు మదోన్మత్తుండైన కతంబున, బహు దుఃఖంబులకు నాకరుం డయ్యెను.

మదనవల్లీ! యిటుల నారాజులందఱు నచటఁ బదునైదు దినంబులు వేడుకగాఁ బ్రొద్దు పుచ్చిరి. చక్రవర్తి రాజులచే ననిపించుకొని తన రాజధానిం జేరెను.

శాంతపురినుండి తప్పించుకొని పాఱిపోయిన వ్రతశీలుఁడు తన కుమార్తె బుద్ధిచాతుర్యంబుచేఁ బ్రాణంబులు దక్కించుకొని వచ్చిన సామర్థ్యంబును బహువిధంబులఁ గొండాడుచుండెను. అతని కొడుకులు అడవులకేగి యట ధనుర్విద్య నభ్యాస పఱచుకొనుచుండిరి. సౌందర్యవల్లి తనకుఁ బదియేండ్ల ప్రాయము వచ్చినదే మగవేషంబు వహించి, తన యన్నలతో నడవులకేగి శస్త్రాభ్యసన పరయై యుండెను.

అపు డొకసన్న్యాసి తన తపోబలంబుచే ధనుస్సును శస్త్రాస్త్రంబులను సంపాదించి, తనకరంబున బూని యందువలన మృగ చోర బాధల నందక నిర్భయంబున నుండెను. సౌందర్యవల్లి యప్పటికప్పు డతని చర్యలను జూచుచుండి నది గావున నొకనాఁడు అతని కడకుఁ బోయి, పాదంబులపై వ్రాలి భయభక్తులతో నొక యోర నిలిచి, స్వామీ! నా సందియంబు దీర్ప వలయును. అది మీచేఁగాక యితరుల వలనం గాదు. ఎఱింగింప ముదల యిచ్చితిరేని నెఱింగించెద ననియె. అతండు పురుషవేషధారిణియగు సౌందర్యవల్లినిం గని వత్సా! భయంబునెందక నీ మదిం గలవాని నానతిమ్ము ఎఱింగించెద ననియె.

సౌందర్యవల్లి:—స్వామీ! భగవంతుఁడు ప్రణవస్వరూపుండని పెద్దల వలనను శాస్త్రముఖంబునను గనుంగొంటిని. అతని నితర సాధనంబులు లేక సులభంబుగాఁ దెలిసి కొనుటకు శ్రేష్ఠంబగు నుపాయ మెయ్యది నా కెఱింగింపుము.

సన్న్యాసి:—వత్సా! పరమగోప్యం బడిగితివి. అయినను నీ యందలి వాత్సల్యంబున నెఱింగించెద. సావధానమతి నాలింపుము. భగవంతుని సులభంబుగ నెఱుంగు నుపాయము యోగ మగును.

సౌందర్యవల్లి:—స్వామీ! అటులైన నాకీ రాజయోగ క్రమం బెఱిం గింపుము.

సన్యాసి:—వత్సా! ఈ పరమరహస్యం బగురాజయోగంబును భక్తితో ననుసరింప వలయును. అటులం జేయఁ జేతకాని వారై సంసార సాగరంబున మునుంగు చుందురు. ఇది యెల్లరికి లభింపదు. భగవంతుని కరుణాకటాక్షంబు గలభక్తులకే లభించును. కావున నీవు వినుము. ఇది మోక్షమునకుఁ బోవు పెద్దబాట. దాపవలసినవానిలో నిది గొప్పది. విద్యలకు మేటి. ఇది తారకము, సాంఖ్యము, అమనస్కము అని మూడు విధంబులగును. అందు తారకము మనస్సును నిర్మలముగాఁ జేయును. సాంఖ్యము బ్రహ్మ మిట్టిదని తెలియం జేయును. అమనస్కము అపరోక్షజ్ఞాన మగును.

జననమరణమను సంసార సాగరంబును దాటించుటకుఁ దేపమై యుండుటచేఁ దారకంబని యందురు. ఇది పాపంబుల నశింపఁ జేయును కామక్రోధములఁ దల నెత్త నియ్యదు. మఱపును దొలంగఁ జేయును. ఆత్మ సుఖానుభవంబును వృద్ధి సేయును. ఉపనిషత్ ప్రోక్త మైనది. ఈ తారకయోగమును నభ్యసించుటకుఁ బ్రాలుమాలి యుపనిషద్వాక్యములను నోటఁ బ్రేలుటచేఁ గుక్షి లాభంబుగాక మోక్ష లాభంబు గలుగునే? వత్సా! వారికి బ్రహ్మానుభవంబు నీటిమూట. చక్కెరయని నోటఁ బలుకుటచే రుచి తెలియునే? దీపమని చెప్పినంతమాత్రాన జీకటి పోవునే? అన్నంబును వర్ణించిన నాకలి యడఁగునా? ఈ యోగాభ్యాసంబుచేఁ బ్రాణముల గర్వ మడఁగును. మనస్సు చలింపదు. ఇంద్రియము లడంగును. కామక్రోధములు దాఁగును. తనకు సుఖానుభవము దొరకును. ఇది యభ్యసించువారికి నన్నియు మితములై యుండనగును అటుగాక యధికంబుగగాని లేక గాని యుండరాదు. జనశూన్యమైన నిర్మల సమప్రదేశంబున కుశాజిన వస్త్రంబులఁ బఱచి, దానిపై సుఖాసీనుఁడై నడుము, గొంతు, తల వీనిని వంపక నిక్కికొని ముక్కుకొనను

జూచుచు రెండుజాములు బ్రహ్మచర్యంబున నితరముల నెంచక గురు ప్రోక్త లక్ష్యంబున నిలిచి యందుఁ దోఁచు కళను తన మనంబున జేర్చి నిష్ఠ సలుప వలయును.

సౌందర్యవల్లి:—స్వామీ! ఆ లక్ష్యంబు లెయ్యవి ఎఱింగింపుఁడు.

సన్యాసి:—వత్సా! ఖేచరి, భూచరి, మధ్యమ, షణ్ముఖి, శాంభవియని లక్ష్యంబు లైదు. వీనినే ముద్ర లందురు. దీనిని గురూపదేశ మార్గంబున నెఱింగి యభ్యాసంబు చేయఁ బ్రణవంబునందలి నాద బిందుకళల నెఱింగి ప్రణవలక్ష్యార్థంబగు బ్రహ్మమే తాను నను నిర్వికల్ప స్థితిని బొందును. అని యా పురుషవేషధారియగు సౌందర్యవల్లికి నా రహస్యంబుల నెఱింగించి మఱియు నిట్లనియె. కుమారా! యీ ముద్రలను వాడుక పఱచితివేని, నాద బిందు కళల విని కన నగును. ఈ నాదబిందుకళలయందే మానసేంద్రియంబులు నిలుచుటం జేసి శరీర వికారంబు లుండవు. కావున నీ మార్గమే శ్రేష్ఠమైనది. గాలంబులేక చేపలు దొరకనివిధం బున నాదబిందుకళల నెఱుంగక యింద్రియ మనంబులు నిగ్ర హింపఁ బడవు. కావున షణ్ముఖీముద్ర నభ్యసింపు మనియె.

అంతట సౌందర్యవల్లి యాముద్ర నభ్యసించు నదియై రెండుచెవు లను మూసి వినెను. సంతసించి చెప్పుచున్నది.

స్వామీ! చిణి, చిణిచిణి యని రెండు విధములుగ శబ్దించెం పిదప, ఘంట యొకటి వినం బడియె. పిదప శంఖంబుమ్రోగెను. అవల వీణానాదంబు చెవుల పండువయ్యెను. తరువాత నెవరో యాడి పాడి నట్లుండెను. వేణునాదంబువింటిని. పిదప భేరి భాంభాం అని మ్రోసెను. మృదంగధ్వని విన నయ్యెను. మెఱుపుదీగలతో మేఘంబు లుఱిమెను. ఇవి యేమి?

సన్యాసి:—బాలకా! ఈ పదియుఁ బ్రణవనాదంబు లందురు. దీని నభ్యసించని వారిమనంబులు అల్లలాడుచుండును కావున నిది యభ్యసింపఁ దగినది. పిదప సౌందర్యవల్లి కనుంగవలను గురుని యనుమతింగొని మూసి బొమలనడుమ దృష్టిని నిలిపి జితేంద్రియత నొప్పి కొంతయుండి యిట్టు లనియె.

స్వామీ! కృపాభూమీ! మొదట నేదో యొకటి కనంబడినది. ఆపైఁ జూపులై కనుల వెంట నొకటి పోవుచుండెను. అది యేమి?

సన్యాసి:—నీకు మొదటఁ దోచినది చిత్తాకాశము. కనుల వెంటఁ జూపులై పోవునది మనస్సు, అందలి వింతలం జూచి చెప్పుము.

సౌందర్యవల్లి:—స్వామీ! నా కనులకుఁ గానంబడుచున్న చిత్తాకాశంబున రూపంబులేక యొకటియు, గటికిచీకటిగ నొకటియు, కారుచిచ్చొకటియు, లెక్కలేనికాంతులనుగలిగి యొకటియు, కనులు మిఱుమిట్లు గొలుపు వెలుగుగల దొకటియు నిటుల నైదు కనంబడుచున్నవి. అవి యేవి?

సన్యాసి:—వత్సా! మొదటిది గుణరహితాకాశమనియు, రెండవది పరాకాశమనియు, మూడవది మహాకాశమనియు, నాల్గవది తత్త్వాకాశ మనియు, అయిదవది సూర్యాకాశంబనియు వచింతురు. ఇక నా యాకాశ పంచకంబునకు నడుమ వెలింగెడి కళా స్వరూపంబును ముందుగాఁ దెలియఁజెప్పెద వినుము. చిత్కళలు తేనె, మల్లె పూవులు, చందన సుమంబులు, కర్పూరము, నక్షత్రము నీని కాంతిని గలిగి యుండును. మెఱుపు తీగలవలెఁ బకపక్కు మనును. మిణుఁగురుపురుగులవలె నిలిచి నిలిచి ప్రకాశించును. నీలనీరదంబు విధంబునను నవరత్నముల భాతిని, అపరంజి జిగి వన్నెనను మెఱయుచుఁ దళతళలాడుచు, తునియలు తునియలై గుంపులుగుంపులై నిండారగ మట్టుచు. భూమిమధ్యా

బున మొదటఁదోచి హృదయాకాశంబున కెక్కి వృత్తిసాక్షియై, యావరణవిక్షేపంబులఁబోనడంచి, జ్ఞానసూర్యుఁడు వెలుఁగును. ఆ జ్ఞానసూర్యుఁడు తోఁచుటకుమునుపే జాగ్రతనొంది భ్రాంతిని వందు పుట్టిన మఱపును విడిచి, వైరాగ్య విజ్ఞాన ఉపరతులచే మలమును బోఁగొట్టి సాక్షిని నేనేయని తలంచి, ఆనంద భాష్ప యుతుండవై సందియంబుల దిగనాడి మౌనమును వృత్తిరాహిత్యమును బొంది యఖండ చిదానంద మనుభవింపుము. అటుల ననుభవించి ద్రష్టృ దర్శన దృశ్యముల నడంచి యఖండ స్వరూపుఁడవుకమ్ము. అరిషడ్వర్గములడంగ, దేహాభిమానముపోవ, సలయ విక్షేప కషాయ రసాస్వాదములంగల బుద్ధీంద్రియములు లయంబు కాగ, సాక్షి వివేక అఖండాకారవృత్తులు ప్రజ్వరిల్ల, ఎఱుక మఱపులు వేఱు వేఱు కాఁగా, మతసంబంధ భిన్నజ్ఞానములు తేలిపోవ, జ్ఞానచంద్రుఁడు నీ హృదయంబున ననన్యమై వెలుఁగును.

సౌందర్యవల్లి:—స్వామీ! బుద్ధీంద్రియములకు నాలుగు వృత్తు జెప్పితిరిగదా వాని వివరింపుము.

సన్యాసి:— నిద్రయే సలయము. ప్రపంచవృత్తులను బో మఱచుట విక్షేపము. ప్రపంచ వృత్తియుఁగాక, లోకన వృత్తియును గాక స్తంభంబు విధంబున న యము. జాగ్రదవస్థయే రసాస్వాదము. లేచి తి పోవును. నిగ్రహించుట వలన విక్షేపమేగును. ననుసంధించుటచే కషాయమరుగును. ఏదియుఁ కుండుటచే రసాస్వాదమునకు నివృత్తి.

సౌందర్యవల్లి:——స్వామీ! తమకృపచే నెఱింగితిని. కడకు వచించి కృతార్థురాలం జేయుము.

సన్యాసి:—కుమారా! అపరోక్షజ్ఞానమునే జ్ఞానచంద్రుఁడనియు జ్ఞాన సూర్యుఁడనియువచింతురుగాని సూర్యచంద్రులట లేవు. అపుడు

దహరాకాశంబున నున్నని యవస్థ యందుండెడి ముక్తికాంతను జేరి, సమస్తమును దిగవిడచి యానందింపుము. సమ భావంబును విడువక ప్రాప్తంబులను గోరికలులేక యనుభవింపుము. ధర్మకామంబుల నాసక్తినుంచకుము, అంతట నపరోక్షజ్ఞానము నీ హృదయంబున పాపభంజనమై యొప్పును. ఇదియే వహ్ని మండలం బందురు. పిదప రాగాదులను బ్రణవంబుచేఁ జంపి విషయాదులను వాసనలతోడ విజ్ఞానంబున వ్రేల్వుము. బ్రహ్మానందం బనుభవింపుము. ఇపుడు నీకుఁ జెప్పిన అగ్ని సూర్య చంద్రమండలంబులకు నడుమ నీ మూఁటికి మొదలిదైన హిరణ్మయ మండలము తోఁచును. అది నీలతోయద మధ్యస్థ నీవారశూకంబు భాతి సూక్ష్మమై నిర్మలమై వర్ణరహితమై యచింత్యప్రకాశమై యుండును. ఆ హిరణ్మయమండలమును ఆపోజ్యోతి యందురు. అది యాజ్ఞాచక్రంబున నుండునట్టి చిత్కళ. ఆ కళమీద మొదలింటి వెలుగు వెలుఁగును. అదియే పరబ్రహ్మము. ఆ మొదలింటి వెలుగును జూచితివేని ననేక సూర్యులు అనేక చంద్రులు. అనేక మెఱుపుఁదీగె లొక్కటిగాఁ జేరి ప్రకాశించిన నెట్లుండునో యట్లుండును. దానిని విక్షేపంబును దాటి [illegible]రణమును దాలంగదోసి. భ్రూమధ్యంబునఁ జూడుము. [illegible]న్నా! యీవిధంబున హృదయాకాశంబున దోఁచు ఆకాశ[illegible]లము, తమోమండలము, మేఘమండలము, విద్యున్మండ[illegible] నక్షత్రమండలము, జ్యోతిర్మండలము, సూర్యమండలము, [illegible] మండలము, అగ్నిమండలము హిరణ్మయమండలము అను [illegible]టిని నాదంబులు పదింటిని హంసతత్త్వమును గలిగి కార్యంబుల [illegible]ంటక చిన్మాత్రుండై యన్నింటిని విభజించి మెఱుంగువాఁడె నాదబిందుకళాతీతుఁడగు ప్రత్యగాత్మ. నాదబిందు కళాత్మకయగు విజ్ఞానంబు నాశ్రయించి యాత్మయందు ఆత్మాకారాకారిత వృత్తిం గలిగి వదలుము. నీ వపుడు ఎండయందుంచిన దీపకలికవలె ఇంద్రియ ప్రాణ మనోవృత్తుల దిగనాడి నిశ్చలాదులం బొంది రాజయోగ తురీయ సమాధిని బొందుదువు.

సౌందర్యవల్లి:—అట్టి సమాధి నొందుటకు నుపాయం బెయ్యది.

సన్న్యాసి:—బిందు చాంచల్యం బుడుగక మనోనిలంబులుడుగవు. మనోనిలములు చలింప కుండిన పూర్ణ సమాధిం బొంద నగును.

సౌందర్యవల్లి:—బిందు చాంచల్య మెట్లు లుడుగును!

సన్న్యాసి:—హంసతత్త్వంబు నెఱింగిన నుడుగును.

సౌందర్యవల్లి:—నాదబిందు కళలన నేమో దానిని హంస తత్త్వంబు నుపదేశింపుము.

సన్న్యాసి:—వత్సా! ప్రాణఘోషమే నాదము. దేహేంద్రియ ప్రాణ మనంబులకు నగ్రమనందు బుద్ధియే బిందవు. ఆ బుద్ధిని దోచెడి ఆత్మ బింబమే కళ. హంస యన జీవుడు. అని యా రహస్యంబుల బోధించి దీనిని దిన దినంబును రెండు జాములు నియమము దప్పక యభ్యసింపుము. ఈ సూక్ష్మ తారక సిద్ధి యగును.

సౌందర్యవల్లి:—స్వామీ! నే నీయోగంబభ్యసించితిని ధన నా బంధువులగు తల్లి దండ్రులును దోబుట్టువులును జడిం బొందుచున్న వారు. ఊరిని వదలి పోరుగూర చెదరు. వారికి సంభవించి యుండు నిక్కట్టు లెట్ల

సన్న్యాసి:—వత్సా! నీ వెందులకును భయంబు నొంద రాజ్యంబు మీకు దప్పక ప్రాప్తించును. వ్యస కుము అని తాను తపోబలంబుచే సంపాదించినధనుస బులు నిచ్చి, ప్రయోగోప సంహార మంత్రంబులం ముండు మని దీవించి పోయెను.

వ్రతశీలుండు నతని కొడుకులును సౌందర్యవల్లిని జ వెదకి యరణ్యంబునం గనిపట్టిరి. ధనుర్బాణతూణీ

తాఁగొన్నది యామె చెప్ప విని మహదానంద భరితులైరి. మన కిక పై నెట్టి భయంబును లేదని తన కొడుకులతో ధైర్యంబు మాటలాడికొను చుండెను.

సౌందర్యవల్లి యొకనాఁడు వాడుక మేరకు తన తండ్రికిని అన్నలకును ధైర్యంబు చెప్పుచుండ, వ్రతశీలునిభార్య తన పుత్రియొక్క బుద్ధి చాతుర్యమునకు మది మెచ్చుకొనుచు, తాము తమ రాజ్యంబునువదలి పరదేశులవలె నితర రాజ్యంబున జీవించినను, బైట నిర్భయంబుగాఁ బోవుటకు లేకున్నది గదా యని వ్యసనపడుచుండెను. సౌందర్యవల్లి తల్లి మొగంబును, నామె కనులనుండి నీరు ధారధారగాఁ గారుటయుఁ జూచెను. తల్లియేడ్చుచుండఁ గూతురేట్లుండును. మనసుతాళక, ఓయమ్మా! మేము బ్రతికియుండగా నీవేల వ్యసనంబు నొందెదవు అని యడిగెను. మహారాణి కూతుంజూచి నా వెతల నేమందును? మనము శాంతిపురిని నేలు కాలంబున సకలదేశాధీశులు మీతండ్రిని వీరప్రతాపయుక్తుండని ...డయును గౌరవంబుగాఁ బొగడుచుందురు. నీకు ముందుగా నీయన్న ...ద్రుడు పుట్టి శౌర్య ధనులై యుండిరి. కడపట లేక లేకయుండి ...దివై పుట్టితివి. నిన్ను జక్రవర్తి కుమారునకుఁ బెండ్లిచేయించి ...త్సవంబుగఁ జూడవలయునని యాసఁగొని యుంటిమి. ...శ్చిక వేణుకంభా। వినాశకాలే ఫలముద్భవంతి। యథాతథా ...నాం। వినాశకాలే విపరీతబుద్ధిః అను నటులను, పేరాస ...గునటులను ఏడియు విచారింపక, చక్రవర్తికిఁ గట్టవలసిన ...ట్టకుండుటచే, చక్రవర్తి యుత్తరవుమేరకు సకల దేశా...బిగాఁ జేరి, మన శాంతపురిపై దండెత్తి వచ్చిరి. అపుడు ...హంమచే భూమిని సురంగముద్రవ్వకొని, దాని మార్గముగా ...యీ దేశంబును జేరి జీవించుచున్నవారము. మన మిటకు ...డ్లయినది. మన కాపులు దళము లేమైనవో తెలియక ...ని యేడ్చెదను అనియె.

...విని సౌందర్యవల్లి, తల్లీ! యింతదాలకై నీవు వ్యసనంబునొంద ...ను నోర్చి యుంటివి. ఇక రెండేండ్లు ముక్కు పట్టుకొని

యుండుము. నేను మన శాంతపురిపై దండెత్తిపోయి, యెదిరించి వచ్చెడి రాజుల నంగళ్లని జయించి, యూరు వెడలంగొట్టి యీతకును మూల కుండైన చక్రవర్తి దేశంబును గైవశంబు చేసికొని, మనకు వారిచే కష్టంబు కట్టునటులఁ జేసెదను వేడుక చూచుచుండుము అని చెప్పెను.

ఆమాటలను దగ్గఱనుండి వినుచుండిన వ్రతశీలుఁడు మదినుప్పొంగి "బిడ్డా: నీ విపుడు చెప్పిన విషయము సరియే." ముందు మనయూరిలో నుండినపుడు దండు దళము లుండినవి. అందఱు నొకటిగా వచ్చుటను జూచి జయింపరాదనుకొని వేఱుచోటికివచ్చి ప్రాణంబుల దక్కించు కొంటిమి. ఇపుడన్ననో మనకు రథగజతురగ పదాతి సేనలును లేవు. మన మెట్లుల చక్రవర్తిని జయింప నగును. చక్రవర్తికన్ననో యాద ఱును దోడు రాఁగలరు. మన కెవ్వరు వత్తురు. సామంతరాజు సేన లను నీవు కనులారఁ గాంచి యున్నావు. అట్టి సేనలను మన మొంటరి గాండ్రయినపుడు జయించుటెట్లు. ఈనీమాటల వినువార లెవ్వరు నమ్మె దరు అనెను.

సౌందర్యవల్లి "తండ్రీ! ప్రయత్నంబు గలవారికిఁ జేటు లేదు" అను వార్త నీ వెఱుంగ నిదియే. జయముండువఱకు భయంబు లేదు. కనుక నే నింకయు రెండేండ్లలోపల, సకల దేశాధీశుల జయించి, వారి వారి దేశంబులఁ గైకొని యదేవిధంబుగఁ జక్రవర్తిని జయించి, నేఁ జక్రవర్తిని నయ్యెదనని శపథంబు చేసెను.

ఒకనాఁడు సౌందర్యవల్లి యొకకలంగని దిగ్గున లేచెను. అపుడు దగ్గఱనున్న తన తల్లియగు మహారాణి హెచ్చరించుకొనెను. సౌందర్య వల్లి యిట్లనియె. అమ్మా! నేటిరాత్రి యొక కలను గంటిని. అది యేది యన, నేను మన శాంతిపురికేగి యుద్ధంబు చేయుచున్నట్లును, సకల దేశా ధీశులు నాతో నధికకాలము పోరినవిధంబునను, మాయన్నలు అలసి సొలసి పడిపోయినట్లును, నేనుమాత్ర మొంటరిగా నిలిచి జగడమాడి నట్లును, పిదప రాజులందఱును నాకుభయంబునొంది, సముద్రముపొంగి

వచ్చునట్లు ఘోషలుపెట్టుకొని పలువెత్తినట్లును, నేనుజయించునట్లును, నాతండ్రియు నాయన్నలును నాకు మకుటాభిషేకంబుచేసి సంతసించి నట్లును, నేను దేశవిచారణ సేయుచుండినట్లును, నొక కలను గంటినని చెప్పెను. ఆమాటలను వినిన మహారాణి తల్లీ! యిదియంతయు జ్ఞప్తి రూపంబగు కలయో జ్ఞప్తియో కన్నది వ్యర్థమనియెంచక యిది యొక కథగాఁ జెప్పెదవే మంచిది రేపటికి నీతండ్రియొద్ద జెప్పి స్వప్నఫలం బును మన రాజ జ్యోతిష్కునిచే నెఱుగనని చెప్పి రాత్రికాలమైనందున నిదురించిరి.

సౌందర్యవల్లి తెల్లవాఱినదే లేచి స్నానాద్యలంకృతంబుల నెఱ వేర్చికొని భుజించి, ధనుర్బాణతూణీరధరయై తమయింటియందలి యొక వసంత మంటపంబునవచ్చి కూరుచుండి, యికమనకు సత్కాలమువచ్చి నదని తన మనస్సునకు తగినటుల నేదేదో యోచించుకొనుచుండెను.

మహారాణిగారు రాత్రి తన కూతురుచెప్పిన మాటలంతయు తలంచి యచ్చెరువంది నప్పటయు, మన కిట్టికాలముసంభవించి రాజాంగమును వదలి పరదేశివేషంబున నీ పురంబున నొంటరులమై యుండుట కైనదే యని వ్యసనపడుటయునుగా నుండెను.

అపుడు రాణిగారిపొరుగుననున్న దాదులు బహు విధంబులుగా ధైర్యవచనంబులచే రాణిగారికి సమాధానంబులు చెప్పి యోదార్చి, అమ్మ పూర్వకాలంబున, నలుఁడు, పురూరవుడు మొదలగు చక్రవర్తు లును తమ రాచఱికంబునువదలి, తమరాజ్యంబునుశత్రువులేల దాము కానలకేగి వెతలనొందుచు మంచికాలము తటస్థించినపుడు శత్రువులను దఱిమి, తమ రాజ్యంబును గైకొని సుఖంబుగ నుండిరని భారతాది గ్రంథంబుల వినమా అని పురాణకథల జెప్పుచు నుండిరి. మహారాణి గారదివిని యొకవిధంబున మనంబునుదేర్చుకొనెను. దాదులును వారి వారికి తగిన పనులం జేయుచు మిన్నకుండిరి.

ప్రతశీల మహారాజు తనపుత్రి సౌందర్యవల్లిని బిలిచి రాజ్య విష యకమగు సంగతుల విచారింప నెంచి, యామెతో దన యింటికివచ్చెను. అపుడు రాణిగారు తన పురుషునింజూచి కిలకిలమని నవ్వెను. రాజు అచ్చెరువంది "చెలీ! నీ కిన్ని దినంబులుగా నింతటి సంతసంబు లేదుగదా నీవు నేడుమాత్ర మిట్టి యానందమున నుండుటకుం గారణం బేమి" యని యడిగెను.

ఆ మాటలను వినిన మహారాణి "నాయకా! నే నేమని చెప్ప గలను చెప్పెదమన్న వింతల నీను చున్నది అనియె. ప్రతశీలుంకు రాణి యభిప్రాయంబు తెలిసినది గాదు. ప్రాణనాయకీ! వింతయన నెట్టిది? మనమీ రాజ్యంబును వదలి పరదేశులమై యున్నవారము. మనకు నొక వింతయే. మనవేష మొకవింతకదా యనియె. ఆ మాటలను విని రాజేంద్రా! తాము దీనినిగుఱించి యోచింపకుడు.

క॥ కరినెక్కి గొడుగు నీడను
నరుగున్నృపులు నెండ నడతు రడవుల నిడుమన్

ఏనుగుపై నెక్కి గొడుగు నీడయందుండు రాజులును తమకుం గష్టకాలంబు వచ్చునపుడు రాజ్యంబును వదలి యడవిం జేరి మిడిమిడి యెండయందునడతురు. అయినను వారికి మంచికాలంబువచ్చినయెడల,

సరియైన వేళ భిక్షా
తురులును రాజ్యంబునందు దురు నిశ్చలతన్॥

అను విధంబునం గూడివచ్చు కాలంబున భిక్షము త్తికొని తిరు చుండువారైనను రాజ్యాధిపతులై మనంగలరు. వీని నన్నింటిని నీకెవ్వ రేచ్ఛ కారణం బగును. మీ రిందులకై వ్యసనంబునొందకుడు. తాము చక్రవర్తితో ద్వేషించి కప్పంబు గట్టనని నిరాకరించిన సమయంబున, సౌందర్యవల్లి యుక్తిచే బ్రతుకును గంటిమి. లేనియెడ శత్రువులచేతం జిక్కి చావవలసినదే గదా. చావక తప్పినపక్షమున నెన్ని యో కడ గండ్లకు లోనై యుందుము. మనము సౌందర్యవల్లిని బిడ్డయని తలుపక

తల్లిదండ్రులమాటలవలె గౌరవించుటం జేసి తప్పి బ్రతికిమి. లేనియెడ బొక్కసంబు మనస్వాధీనమున నుండునే. ఇక మనసౌందర్యవల్లి యుండు వఱకు మన కేమి కొఱతయని మఱల నవ్వెను.

మాటిమాటికి తనరాణి నగుటకు నేదో కారణం బుండవలయు నని యోచించి, "సతీ తిలకమా! కారణంబు లేక నగవుండదు. ఇందుల కేదో హేతువుండవలయును. ఇదివఱకు దుఃఖమున మునుంగుచుండు నీకు నేడుమాత్ర మెటుల నవ్వు వచ్చును" అని యడిగెను. మహారాణి "ప్రాణనాథా! నిన్నటిరాత్రి మనకూతురొక కలంగని లేచినది. దాని నామె యల్పసంతోషియై చెప్పుకొనుచుండెను. నే నదివిని నవ్వుచుంటిని. దాననే మఱల నిపుడు తలంచుకొనంగా వింతయై నగవు వచ్చుచున్నది అనెను. వ్రతశీలుఁడు అదేమికల యోనా కెఱింగింపుము స్వప్న ఫలంబును జ్యోతిష్కులవలన నెఱుంగనగును" అని చెప్పెను. రాణి తన కూతురు చెప్పినకలను సాంగముగా వినిపించెను. రాజందుల కేమి కారణంబోయని వెఱగందెను. ప్రాణపతీ! మనబిడ్డ నే నెంత జెప్పినను వినక మీ రట్టుల దలువకుడు. నేగన్న స్వప్నము ఫలియించునేకాని ఉత్త వోవదనుచున్నది. రాజేంద్రా! ముందు మనము దండుదళముతో నుండియు సామంతులయొక్క సేననుగని సురంగమున దూఱి పాఱివచ్చితిమి. ఇపుడో యెట్టి యాదరవును లేక యుత్తచేతులతో మూర వేయుట యెట్లు? రాజు లేడ మనమేడ. వారితో బోరుట యేడ? ఇదియంతయుం జూడ బాల్యచేష్టితంబు పగిది నున్నయది అనెను.

వ్రతశీలుఁడు కొంత నిదానించి, సతీ! నేఁజెప్పుమాటను గొంత సావధానంబుగ నాలోచింపుము. మనము పూర్వజన్మమునఁ జేసికొన్న సత్కర్మపరిపాకంబుచే మనకు నతిశూరులగు కొడుకు లిరువదుండ్రు పుట్టిరి. వీరి గౌరవంబుచే నేను రాజులనందఱిని దృణీకరింపుచుంటిని. చక్రవర్తికిని గప్పంబుగట్టకున్న వీఁడేమిచేయునని మదంబు గొంటిని. వీరి ప్రాపుచే సార్వభౌమత్వమును బొందనెంచితిని. పిదప నీసౌందర్య వల్లి పుట్టినది. పిదప మఱింత మదంబుగొని మనబిడ్డలకు విశేషంబుగా

సామర్థ్యము వృద్ధిపొందినదియని తలంచి, కప్పంబుగట్టుటయే మాను
కొంటిని. చక్రవర్తియు మనగౌరవంబును సూచించినసేనయు
నడుగక మిన్నకుండెను. అయినను సామంతులకు నాపై నసూయకలు
గుటంజేసి చక్రవర్తికిదోడయి యొకటిగా వచ్చి మనదేశంబున యుద్ధం
బొనరింప వచ్చిరి. అపుడు మన సౌందర్యవల్లి బుద్ధి చాతుర్యంబుచే
నడవివఱకొక సొరంగమును ద్రవ్వి యందు బ్రవేశించి వచ్చి యీదేశం
బున నిలిచితిమి కనుక మనబిడ్డ తలంచెనేని మనము సకలదేశంబుల నేక
చ్ఛత్రాధిపతులమై యేలగలము. ఇంతలకు సందియంబు లేదని సఖలా
హారంబుల దృప్తుండై వసంత మంటపంబునకు వచ్చెను. అపుడచ్చట
సౌందర్యవల్లి పురుషవేషంబును ధరించి, ధనుర్బాణ హస్తధరయై,
రాత్రి కన్న కలను జింతించుచుండెను.

వ్రతశీలుండు తన కూతురింగాంచి "ఏమి విశేషము. నీవు నేటి
దినము ఏదో యొక విధమగు నాలోచన యందుంకున్నట్లు కనంబడియె
దవు. దీని నిజంబును విశదంబుగా నెఱుంగం బల్కుము అని యడిగెను.
ఆ మాటలను విని సౌందర్యవల్లి. తండ్రీ! యిన్ని దినంబులు లేక నేటి
రాత్రి యొక కలను గంటిని. కలలు కలవరింతలని అమ్మ చెప్పుచున్నది.
ఇన్ని దినంబులు లేని కలవరము నిన్న యేల రావలయును. భగవంతు
డికపై జరుగువానిని ముందుగాం గలలయందుంజూపుచున్నాడని పెద్దలు
చెప్పుదురు. ఇపుడు నేను గన్న కల నిజముగా జరుగునని తలంచెదను.
నీవును మా యన్నలును దోడురా మన శాంతపురికి నేను బోయి,
యుద్ధంబు చేసితిని. అందు మీరు మూర్ఛ నొందితిరి. నే నొక్కతెనై
యుండి వారల నోర్చితిని. పిదప నే నన్ని దేశంబులకుం జక్రవర్తినినై
పట్టాభిషిక్తురాలనైనట్టుల నొక కలంగంటిని. అని చెప్పి తండ్రీ! మనము
నేటిదినమే మనయూరికిం బోవలయును అనెను. వ్రతశీలుం డట్టులన
కానిమ్మని సమ్మతించి, తన కుమారులకును నీసంగతి నెఱింగించెను.
వారును సమ్మతించిరి. తనయింటి వరపుషకాంద్రు సందఱిని నొక యే
కాంతస్థలంబునకుం గొనిపోయి వ్రతశీలుం డిట్టులనియె. మన మాదేశ
మును ఇచటికి వచ్చి యైదేండ్లు కాలమైనది గదా. ఇంతవఱకు మన

మెత్తుకొని వచ్చిన ద్రవ్యము నుంచుకొనియే బ్రతుకుచు వచ్చితిమి. ఎంత గొప్పమొత్తమైనను గొంచెము కొంచెముగ సెలవుచేయుచుండిన దఱుగకుండునా? వరచుండి వరవునకు దగిన సెలవు చేయుచుంటిమేని మొదలు తఱుగక యుండునని యెల్లఱకు దెలిసినవిషయమే అది గావున మేమిపుడు వర్తకంబుసేయ బోవుచున్న వారము. మీరందఱును మా యింటియందే సొంతగాండ్రవలె నుందురని కోరుచున్న వారము. మేము తిఱుగువచ్చునపుడు ఆయా దీవులందలి విచిత్ర వస్తువులను గొని తెచ్చె దము. మీకు దానినిచ్చుటయేగాక మూడునెలలజీతమును ఇనాముగా నిచ్చువారము. మేము వచ్చుటకు నెన్ని దినంబులైనను ఇంటిని వదలక కాచియుండుడు అని యొప్పజెప్పెను.

వారును మది నుప్పొంగి "మహానుభావులారా! మీపాపువ మేమింతవఱకు బ్రతుకుచుంటిమి. తిని లేదను పాపి గలడే. ఇంకను దమ యనుగ్రహంబునకే యెదురు చూచెదము. మీరున్నపుడైనను మేము అజాగ్రతగ నుండవచ్చునేగాని లేనియపుడు మా సొంతయింటి వలెఁ జూచుకొనమా. యజమానుని యక్కఱకు రాని సేవకులేల? యజమానున కున్నంతవఱకు నిచ్చకంబులాడుచుఁ బెట్టికొని తిని, లేని యపుడు వా డేమి యిచ్చెను. మేమేమి తింటిమని మాటలాడు చెన టులు కలరు గాని మే మట్టివారముగాము. మేమెంత యిపుడు చెప్పినను అది యంతయు నాత్మస్తుతియై యుండునేగాని నిక్కమని తెలియదు. మీరు తిఱిగి వచ్చినపుడు మా గుణావగుణంబుల నరసికొనుడు. జరిగిన వెనుక నేమి చేయనగునని తలంచెదరేమో. ధర్మప్రభులరగు మీకుఁ గీడెన్నటికిని రాదు. లోకము భగవంతుని చేతుల నిలిచియున్న దేకాని నెట్టికి లేదు. కొందఱు మూఢులు ఎఱింగినవారివలెఁ దమకుఁ బ్రాప్తిం చిన సంపదలు కాకతాళీయ న్యాయంబులనియు భగవంతుఁడెటనున్న వాఁడనియుఁ దలంతురు. అది సర్వసమ్మతంబని చెప్పువార లెవరు? దేవరా! మీపాదపద్మంబుల శరణంబుగఁ బొందిన మామాటలనమ్మి మనంబున నెట్టి కళంకమునుంచక సంతసంబున బేరంబునకుఁ బొండు. పంక్షు పూండ్లయినను,నూఱాఱులైనను మీ గడపను దాటము.మీకడ

పనుదాటి యిట్టిపనియే మఱియొకచోటను జేయవలసినదే కదా. ఆ పనినే మీకడ సేల చేయరాదు అని నమ్మఁజెప్పి తమతమ పనులకుఁ దామేగిరి.

వ్రతశీలుఁడు వారిమాటలనువిని యానందించెను. పుత్రులారా! మనభాగ్యమే భాగ్యము. మన మిపుడు చేపట్టినదెల్లను బంగారమగు టకు సందియంబు లేదు. మనబేరంబును సారంబై తేలునని యెంచెద. లేనియెడ మన కడనుండు సేవకు లైకకంఠ్యంబున నిట్టి గట్టిమాట యిత్తురే. మగవార లింటనుండునపుడే సేవకు లొకపనిం జేయుదురు. ఒకపనిం జేయరు. చేసినపనియైన సమగ్రంబుగ నుండదు. ఇటుసేల చేసితిరన గొణుగుకొందురు. ముఖమును ద్రిప్పికొందురు. ఇంట మగ వారులేనపుడు చెప్పవలసినదేమి. మనసేవకు లట్లుగాక మన యిష్ట వచ్చినట్లు నడచువారు. లేనియెడ నిట్టి గట్టిలమాట నిత్తురే. మనమెట్టి కొన్నపనియో యగాధమైనది. ఇల్లు వాకిలియని చూచిన నగును. మనమిపుడు ఇంటివిషయమై చేయవలసిన బందోబస్తులను జేసితిమి. ఇకపై మనవలనఁ గాగల కార్యమేమి. అన్నిటికి భగవంతుఁడున్నవాఁడు అని కొడుకులకుఁజెప్పి యింటి కేగెను. సేవకులందఱును వారివారి భార్యాపుత్రులతో వ్రతశీలు నింటియందు వచ్చి చేరిరి. వారిచుట్టములు ఎచట నుద్యోగంబున నున్నవారని యడుగ ధనవంతుఁడైన యొక యోడవ్యాపారియింటఁ గొలువున్నవారమని ఘనతగాఁ జెప్పుకొందురు. వ్రతశీలుఁడు తనయింటనుండు భార్యా పుత్రులకు ఓడ బేరంబునకుఁ బోయివచ్చెదమని యుపాయంబుగఁ జెప్పెను. యుద్ధంబున కేగెదమన్న నొప్పుదురే. వారును నింటఁ గూర్చొని తినిన యెన్నిదినంబులకు వచ్చు నని తలంచినవారైరై మంచిది మీరుపోయి వేగరండు ఆలస్యముచేయ కుడు. మీతోడ మన సౌందర్యవల్లియు వచ్చునేని మాకును మనస్సు దిటవుగా నుండును. ఆమెయు వచ్చునేయని యడిగిరి. వ్రతశీలుఁడు ఆమెలేక యేకార్యము మేము చేసెదము. పతికిఁ సతికిఁబులందు నామెకు మించి తెలిసినవార లెవరు? ఆమెను వదలి మేమేమి చేయఁ గలము అని చెప్పిరి. అందఱును సంతసించిరి. వ్రతశీలుఁడు తన పుత్రి

పుత్రులతో శుభలగ్నంబున గావలసిన ద్రవ్యమెత్తుకొని బయలుదేరి సముద్రపు గట్టునకు వచ్చిరి. అపుడే యోడ శాంతిపురి మార్గంబును బట్టి పోవుటకు సిద్ధమై యుండెను. ఆ శుభలక్షణంబున కందఱు విస్మయంబు చెంది కేవును చెల్లించి, యోడపై నెక్కిరి. ఇతరదేశంబులకుం బోవువారు నందుండిరి. ఓడ కదలి కొంతదూరంబు నడిమి సముద్రంబునకు వచ్చెను. గాలి యనుకూలంబుగ వీచుటం జేసి యెట్టి తొందరవును లేక యోడ నడచుచుండెను. ఓడయందలివారు పురుషవేషధారిణియగు సౌందర్యవల్లి ముఖవర్చసును సౌందర్యాతిశయంబును జూచి మక్కువగొని యీబిడ్డ నోరార నొక కథవిని తనియ నగునని యోచించి, దగ్గఱించి కూర్చొని యుండిరి.

## — వజ్రకన్యకథ. —

అన్నాయీ! నేడు ప్రొద్దు పోనున్నది. మా యందఱి చెవులు పావనములగునట్లు ఒక కథఁజెప్పి మమ్ము ధన్యులం జేయుము. పెద్దవారలు చెప్పెడి కథలకంటెను యిప్పటి పసివారల కథలే ముద్దులై యుండును. అని చుట్టుమూగిరి. సౌందర్యవల్లి వారినిం గని, అయ్యలారా! మీరెఱుంగని కథలు నే నెఱుంగుదునే, అయినను మా గురువర్యునికడ నే విన్న కథ యొకటి కలదు. అది మీకు విన నింపో కాదో యను సందియంబు నా హృదయంబును గలంచుచున్నది. ఒకరికి రుచియైనది మఱియొకరికి నరుచియైయుండును. కొందఱికి పునుగు జవ్వాదులు పరిమళంబులు. కొందఱికి దుర్గంధప్రాయమై యుండును. అందఱికి మెచ్చువచ్చునటులం జెప్పుట యెట్లు? అని చెప్పెను. వారలు సౌందర్యవల్లి బుద్ధి విశేషంబులకు మదిమెచ్చుచు అన్నా! కథ యింపయినను గాకున్నను నీనోటినుండివచ్చెనేని, యింపుకాక మానునా చెప్పుము చూతమనిరి. సౌందర్యవల్లి చెప్పుచున్నది.

నడుమ కేయి జరిగి రెండుగంటల కాలమయ్యెను. అప్పటికని గుశ స్థలంబున నుండెడి జనులు మేలుకనియుండిరి. పల్లవుల కరుణాకటాక్షం

యనేపేకాని యంతకుం బై జగడంబు చేయవలసిన యక్కఱ లేదు. ఇరు తెగలయందు నెవరు బ్రతికియుందురో వారలు స్వేచ్ఛను బొందుదురు. పిఱికితనము చూపినను, వ్యర్థంబుగా నొకరిని జంపుటకు నిష్టంబు లేక యుండినను ఆనందమహారాజుగారి దయగల యుత్తరువుచే యమునింటికి విందగును. అందఱికిం బ్రాణముతీపే. ఇట్లుండుటచేత నందఱుం దమతమ శక్తిమేరకు జగడింప సిద్ధమై యుండిరి.

చెఱయందలి యింకొక భాగంబున వేఱొక తెగవా రుండిరి. వార లేబదుమంద్రకు నఱువదుమంద్రకు మించి లేదు. ఆ భాగము విశాలంబుగ నుండుటచేత వీరికి వసతిగనుం మఱువుగ నుండినది. ఎనమండ్రు పదుండ్రుతప్పం దక్కిన వారందఱును ముసలి ముతుకలే నడివయసున నుండు మగవారి నందఱిని మల్లయుద్ధంబునకై వేఱుచేసియుంచిరి గావున నీ గుంపులో నాడువారును బిడ్డలుమాత్రమే యుండిరి. వారలు క్రొత్తగా నేర్పడిన చైతన్యమతస్థులు, చైతన్యుని ననుసరించువారు. వదంతిమేరకు నీ చైతన్యుండు పౌర్ణమినాడు పిచ్చితలకెక్కి చిలుక సరస్సునంబడి చచ్చినవాఁడు. ఈ పిచ్చివానికిం గొంతగౌరవ మెక్కసాగెను! కొందఱు వీని నొకదేవునిగ భావించి, వీని యుపదేశంబుల శ్రుతిస్మృతులకు విరోధంబుగ నుపన్యసింపం జొచ్చిరి.

వైష్ణవ శైవస్మార్తులందఱు నొకటిగం జేరిరి. ఆనందమహారాజు నాశ్రయించిరి. చైతన్యుల పూడులేక చేయుమనిరి. వీరిపట్టును మాను పలేక మహారాజు కడకు ఒప్పుకొనెను. చదువరులగు పల్లవులవలె నీయానందునకు మత మొక్కటియు లేదు. కాశికింబోయి గంగను స్నానమాచరించి, విశ్వనాథుని గుడియందు బుద్ధునిం బూజించినవాఁడు. గయకుంబోయి యందు జినునర్చించెను. వాఁడు తనకు నందఱికి నన్నిగా నుండువాఁడు. కాల మొక్కరీతి గడుపవలయు నను. వారిలో మొదటివాఁడు. తా నెపుడు నీ చైతన్యులవిషయమై విచారించినవాఁడు కాఁడు. ఏలవిచారించును? వారలో యనామధేయు లగుకొందఱే, ధనధాన్య సంపదలుగాని, చెల్లుబడిగాని కలవా డొక్కడును లేఁడు. వారిని గాటి

యలంబెట్టుట సులభము. అది గౌడులకిష్టము. కనుక వారిని బాధింపం జొచ్చెను. ఈ చైతన్యుని శిష్యుండగు నొకనిని గాశియందుం దలగొట్టెను. మఱియొక్కని జెఱయందుంచి, వానిశిష్యుల ననేకులంజంపెను. కొందఱిని గౌడుల స్వాధీనంబుచేసి ఱాళ్లంగొట్టి చంపునటుల నొనరించెను. మగవారినింబట్టి మల్లయుద్ధంబునం జంపించెను. వయసు నందమునుగల కన్యలగువారిని అమ్మించెను. నడివయసుగను ముదుసళ్ళుగనుండు నాడువారిని వన్యమృగంబులకు వేసెను.

ఈ చైతన్యుల గతియు నట్టిదే. మల్లయుద్ధంబు జరిగినవెనుక మిగిలియుండు చైతన్యులు అరువదుండ్రు ముసలి మగవారుగను, పెండ్లియైనస్త్రీలుగను బిడ్డలుగనుండుటచే వీరిని నెవరునుదీయరు కావున వన్యమృగంబుల కెఱగా వేయబడుదురని ప్రకటించిరి. వీరిపై నాకొన్నపులుల ముప్పదింటిని విడువ నెంచిరి. పులులు తినక విడిచిపెట్టినవారికి గుడ్డలును గొంతపైకము నిచ్చి వదలి వేయవలయునని కరుణాపూర్ణుండగు ఆనందుం డుత్తరవు చేసియుండెను. అతని కౌతకరుణయో? విడుదలచెందిన వారు గౌడులను సమాధానపఱచికొని తమకుం దామే యన్యోన్యముగా బ్రతుకవలయును. గౌడుల కిష్టముండినం జంపను వచ్చును.

పల్లవుల నాటికాలంబునం బ్రజల హృదయంబుల నీతులట్లుండెను. పిచ్చివానినిం బూజింపుచు వానినేతప్ప నితరులను గుళ్ళయందైనను మఱియెచ్చటనైనను బూజింప నొల్లనివారిని ఆ కొన్నపులులు, సజీవులైన బిడ్డ పాపల ముదుసళ్ళ స్త్రీలను గొఱికితినుట వారికి వినోదకరమైయుండెను. పులులు తినక విడచువార లెందఱో యాసంఖ్యగల టిక్కెట్టును గలవారికి మొత్తబహుమతి దొరకుటచేత ననేకులు ధనమొసంగి టిక్కెట్లు తీసిరి. ఇందువలన విశేషధనము చేరెను.

ఈ చైతన్యు లుండిన భాగంబునందలి ద్వారంబున నిద్దఱు పాడుదాండ్రు కూర్చుండిరి. వారికిం గొంతదూరంబున, నొక్కమ్రానుక్రింద నీటెలను జేబూని కావలియుండిరి. వారి కిరువురకుం గలవ్యత్యాసము చూడ

వింతమై యుండెను. ఒకతె యిరువదేండ్లకు మించని గౌడి. ముఖమున గండయను మాటలేదు. కనులుబాగుగను సొంపుగ నుండెను. ముఖంబునను, ప్రత్యవయవమునందును వంశగౌరవము వర్ధిల్లుచుండెను. ఆమె స్థిరపురంబున మేటి సాహుకారియు గౌడవంశతిలకంబు నగు భానునేక పుత్రియు, ఘనసార వంశస్థుఁడగు మాధవునియిల్లాలు నగు చంద్రకల రెండవయాఁడుది నలువదియేండ్లు ప్రాయముగలది. ఆమె రాజపుత్రస్థానంబునఁ బుట్టినది. పసితనంబుననే గౌడు లీమెను చేకొనిరి. వారి కడనుండి మార్వాడు లొట్టెలో కైకొని స్థిరపురంబున నమ్మిరి. ఆమె పొడువుగను, ధైర్యవంతురాలుగ నుండెను. ఆమె మొగంబును గాంచువారు ఎంత గట్టిగుండెఁ గలవారైనను భయంబుఁ బొందక మానరు. ఇట్టి సంకటకాలంబునను నామె మొగంబున ధైర్యంబు దోచకుండెను. అయినను దానియెదుటఁ గూర్చొనియున్న చంద్రకల మొగంబును జూడఁజూడ మది కలఁగుచుండెను. భానుఁ డీమెను దీసినపుడు ఈమెకు తామ్రియని పేరు పెట్టెను. తామ్రమనరాగి. ఈమె దేహకాంతి రాగివర్ణము. ఆమెపుట్టినదేశంబున నీమెకుఁ దారయని నామధేయము. ఈ పేరే చనిపోయిన తన యజమానురాలగు భానుని భార్యకుఁ దెలియును. ఇపుడు చిన్నప్పటినుండి సాకిపెంచిన చంద్రకలకు నీ పేరే తెలియును.

ఆ రాత్రియందు ఆకాశము నిర్మలమైయుండెను. వెన్నెల పిండారఁ గాయుచుండెను. ఎవరైనను వీరిని జూచుచుండినయెడల, వీరి చేష్టితములు ముఖవిలాసములం గని యుండవచ్చును. ఎవరు చూతురు? అందఱును వారివారి పనులయందు నుండిరి. తామ్రి గుడికాలిపైఁ గూర్చొని తన చెలిని మడిమెనుంచి యాకాశంబును జూచుచుండెను. అప్పుడే చంద్రకల చేతుల దిగువనుంచి యాకసంబును జూచి నిట్టూర్పు విడిచెను.

తారా! యిదే మనకడపటిరాత్రి. చంద్రుఁ డాకసంబునఁ బోవుటను ఇకపైఁ జూడఁజాలమని తలచెద నని వ్యసనంబుదోపఁ జెప్పెను.

తల్లీ! దిగులు చూడకుమమ్మా. మనకు బోధించినవన్నియు నిజములైనపక్షమున నీ చంద్రుని నీ జగమంతయు నెప్పుడును జూచుచుందు

దుము.నిజము కానిపక్షమున వెలుతురు చీకట్లు మనలబాధింపవు. అయి
నను నేనొక్కటిచెప్పెదను. మనమిద్దఱిలో నెవరును జేపటికిఁ జావమని
నిశ్చయంబుగా నమ్మెదను.

చంద్రకల మందహాసంబుచేయుచు, తారా! నీవెటుల నివర్తిం
పగలవు. పులులు నరులను గౌరవించునదికాదే.

అమ్మా! నాదేహంబును పులులు గౌరవించునని తలంచెద.
నాకుఁగాను నిన్నును గౌరవించును.

తారా! నీమాటల కర్థమేమి?

అర్థమా? నేను పులులకు భయంబునొందను. అవి మాయూర
నుండు కాపులు నాయుయ్యెలచుట్టును దిఱుగుచుండునవి. మా దేశం
బున మా తండ్రికి వ్యాఘ్రేశ్వరుండని బిరుదనామము. అతఁడు పులు
లను మఱుపువాఁడు. ఏమి యటులఁజూచెదవు? మా చేతులార వానికి
నెఱవేతుము. అవి మాపైఁ బిల్లులవలె వచ్చి రాచికొనిపోవును.

తారా! ఆ పులులెప్పుడో చచ్చియుండును. కడమవాని క్రొల్లు
తెలియును.

అవి చచ్చియుండునని తలవను. రక్తపాశ మెవరినివదలును? వ్యా
ఘ్రేశ్వరుని కుమార్తెను పులు లెఱుఁగకుండునా అవి యెవరిని దిని
నను మనము తప్పించుకొనంగలము.

తారా! నాకట్టి దిటవులేదు, జేపు భయకరమగు చావు చావ
వలయును. తన యజమానియగు పల్లవేంద్రునకు ఆనందుఁడు ఆనంద
ము లొనరించుఁగాక.

అమ్మా! నీ వటుఁదలంచితివేని మన మీపుడేచచ్చెదము. మృగ
ములు మనదేహంబును జెందఱ వందఱ చేయనేల? ముక్కిడిగుంపుల
వినోదంబునకే మాఱు మీదేహ మెత్తినది. నా కొప్పునందు విషమును

దాచియున్నాను జూడుము, దీనిం ద్రావెదము,ముగించుకొందము, దీని చే నెట్టిబాధయు లేదు, అతి వేగంబునం బనిం జేయును.

తారా! అది మంచిదికాదు. ధర్మంబుకాదు. అత్మహత్యచేయరాదు,

నీవు చచ్చిన నీగర్భమునందలి బిడ్డయుం జావవలసినదే గదా. నేడో రేపో, ఎప్పుడోయొకప్పుడు, ఎపుడైననేమి?

తారా ! రేపు ఎటులనుండునో యెవరెఱుంగుదురు. మనము చావక యీ యాందుడే చచ్చునేని బిడ్డ బ్రతికియుండదా? అన్నియు భగవంతుని యధీనంబైయున్నది. భగవంతుఁడు పరిశీలించుఁగాక.

తల్లీ! నీకై చైతన్యనైతిని, అవును, అది యట్టులే, నేనొకటిచెప్పెదను, నేను బ్రతికియున్నంతవఱకు నిన్ను బులులు పెఱుకుకొని తినం జాలవు, అవశ్యమైనయెడల మొట్టమొదట నీ చురియతో నీ బొమ్మున గ్రుద్ది చంపెద, వారు నాకత్తిని దీసికొనిరేని గొంతుపిసికి చంపెద, అటుగానిచో నచటి స్తంభములనుగొట్టి తల పగులం జంపెద నని తామ్రిచెప్పెను.

తారా ! అది మహాపాతకము, నీవు వడిగట్టకుము, నీయాత్మ వ్యర్థమగును.

నా యాత్మయా ? నా యాత్మ యెటులయిన నేమి? నీవే నా యాత్మవు, మీతల్లి నన్నుఁ బతుంటుగాఁ గనుచుండెను. నీవు బిడ్డవై యున్నపుడు నా బొమ్ములపై నుంచికొని నిదురింపఁజేసితిని, నీ పెండ్లి పీటను వేసితిని. అవశ్యమైనయెడల పులులకడంజిక్కు యవస్థ నొందనియ్యక నిన్ను జంపెదను, పిదప నీపయింబడి నా ప్రాణంబుల విడిచెదను, తఱువాత దేవఁడో దయ్యమో, యెదియో, నాకక్కఱలేదు. నా యాత్మను స్వర్గంబుననో నరకంబుననో యుంచనిమ్ము.

చంద్రకల నిట్టూర్పుల విడుచుచు "తారా ! నీకు నాపై నధిక ప్రేమ యుండుటచేత నిటు లాడెదవు, అట్టి మాటలాడకుము. నేనును

నాయుసంబుగఁ జచ్చి నామగనితోఁ గలిసికొనవలయు ననుటయే నా కిష్టము. బిడ్డ యొకటియున్నది గదా, మేము ముప్వురము జననమర ణంబులేక శాశ్వతంబుగా నుండగలము, తారా ! మఱచితిని. మఱ చితిని, మగడు బిడ్డ వీరివలె నీవు నిపుడు నాకుఁ బ్రాణపదయగుటచే ముప్వురముకాము, మనము నలువురమును అని చెప్పెను.

అట్లు జరుగదు. అట్లు జరుగవలయు నని కోరదు. నీ పనికత్తె నీ యింటికుక్క యటులఁ దలంచునే.నా దేహమైనను పులులకిచ్చి నిన్ను గాపాడఁ చలను. అని చెప్పుచు పండ్లు పెటపెట గొఱుకసాగెను. తటా లుమని వంగి చంద్రకలకు ముద్దిడి యో యని యేడువసాగెను.

విను! పులులు బొబ్బ్పుచున్నవి! అని చంద్రకల చెప్పెను.

వేటకాఁడు అడవియందు పులిబొబ్బను వినునటులఁ దలయెత్తి తామ్ర వినెను. అచటనుండు కావలివాఁ డొకఁ డదివినియెను. ద్వారం బుముందర నిటు నటు ఘారాదిరిగెడి పల్లవుడుగాడు. చెఱసాల కాపరి. వానిచేత నొక పెద్ద కత్తియుండెను. వానిపేరు నిర్ఘాణుడు. విని, ఆహా! ఆహా! దానిని వినుడు. అందమైనపిల్లికూనలు కూయుచున్నవి, కూన లారా ! అవసరపడకుడు. మీ కడుపాఱఁ గొంతసేపటికి మేతదొర కును అని చెప్పెను.

తామ్ర కూతల నెంచుకొని "పులులలోఁ దొమ్మిది ముసలివి వానికూతలు విన్నదే నేను బసిదాన నైతిని. అవునవును. అడవివాసన కొట్టుచున్నవి. మాయయ్య గుడారమునుండి పొగరేగుటయు జూచు చున్నాను. బిడ్డనై యుండినపుడు నేను వానిని వేటాడితి. ఇపు డవి నన్ను వేటాడును. వానికిఁ గాల మిది.

నాకుఁ దలదిఱుగుచున్నది. బొమ్మ అడచెడిని. అని చంద్రకల చెప్పుచు తామ్రకై యొఱిగెను. తామ్రి కరుణావివశయై చంద్రకలను జవిరియెత్తుకొని దగ్గఱనున్న యూటకడకేగి జలంబుల మొగంబునఁ

బ్రోత్సహించి, కొంత త్రాగించెను చంద్రకలకుఁ దెలివివచ్చి యటనుండెడి యొకతాటితిన్న కొఱగికొనెను. ఆప్రదేశము నీటిపట్టునకు దగ్గఱ నుండుటచే జిల్లుమని యుండెను. అయినను నిద్ర కనులఁ బట్టినదికాదు. రేపు చావు నిశ్చయమని తెలిసి యెట్లు నిద్రించును?

వీరీ విధంబున నుండ నొకతలుపు తెఱువంబడెను. మగవారు స్త్రీలు బిడ్డలుగ ననేకులు వచ్చిరి. ద్వారమునందుండిన చెఱకాపరి వీరిం జూచి "స్థిరపురంబుననుండి పులుల విందునకుఁ దప్పక వచ్చినవారు వీరు. చైతన్యులారా! లోనికిఁబొండు మీమీ యలవాటుమేరకు భుజింపుఁడు. కావలసినవన్నియు యథేష్టముగా నున్నవి. మీరు ఆకలిచెంది యున్నారు. ముక్కుఁబట్టక వేయుఁడు. తినబడకమునుపే తినుఁడు. మోక్షంబునకైనను పులుల కడుపునకైనను దూరుఁడు అనియె.

ఆ గుంపులో వెనుకవచ్చెడి యొక ముసలవ్వ నడువలేకనడచుచు వచ్చుచుండి పరిహాసముచేయు కాపరిం జూచెను. ఓరీ మాలకుక్కా! భగవంతుని దూషింపకుము. దూషించుపో! నీకుదగిన ఫల మనుభవమగును. అనాగతంబుల నెఱుంగు శక్తినింబొందిన ఆర్యనగు నేను దుష్టుండవగు నీకు హితంబుచెప్పెదను. నీ వింతకుమున్ను చైతన్యుఁడవై యుంటివి. కనుక నీవు రెంటికిం జెడినవాఁడవు. నీవు నేడు తిన్నతిండియే కడపటిదని యెన్నుము. అనెను. అదివిని యా యోఘ్నుఁడు పొట్టకూటికై మతంబును వదలిన వాఁడగుటఁ జేసియు, నతని తోడునీడలుగ నుండిన చైతన్యుల నిపుడు గాఱియ పెట్టుటచేతను మిగులఁ గోపించి, తాఱుమాఱుగదిట్టి మొలనున్న కత్తినిందూసెను. అపుడార్య, ఓరీ! కత్తిదూసెదవా. ఆ కత్తివలననే చావుము. అనిశపించి, యటనుండ నొల్లక యామె కుంటుచుఁ దనవారిం గలిసికొనెను. శాపాక్షరములు వానిచెవులకు ములుకులై సోక, తనువుచెమర్చెను. వడవడ వడంకెను. మొగము తెల్లనియ్యెను. వాఁడు మును చైతన్యుఁడై యుండినపు డీమె మహత్త్వంబులఁ గనులారఁ గాంచినవాఁడు. వీరందఱును చంద్రకలయుఁ దాప్రమయుఁ గూర్చొనియున్న యాటకడకు వచ్చిరి.

చంద్రకల "జయ మగుం గాక" యనిమె. గోరంగునకు జయము అని వారలు ప్రత్యుత్తరమిచ్చి యితరు లున్నచోటికిం బోయిరి. అందఱికిఁ గడగా కొంత దూరమునందు ఆర్య వణకుచు గుంటుచు నల్లనల్ల కొయ్య నూనుకొని వచ్చుచుండెను. ఆమె రాఁగనే చంద్రకల లేచి నిలువంబడి నమస్కరించి కౌగలించుకొని, తల్లీ! ఆర్యా! నన్నె ఱుంగవా. భానునికూతురు చంద్రకలను అని తన్నె ఱింగించికొనెను. చంద్రకలా! బిడ్డా! అయ్యో! నీ విట కెట్లువచ్చితివి అని భ్రమనొంది యడిగెను. తల్లీ! నీ వెఱుంగని దేమున్నది. మనము చైతన్యులము ప్రోక్కవలసిన దారి యిదియేగదా యని వ్యసనంబుతోఁ జెప్పుచు, అమ్మా! ఇట విశ్రమింపుము. నీ వలసియున్నావు, తారా! యీమెకుఁ జేలాగిమ్ము అనియె. మెల్ల మెల్లన ఊటకడఁ గూరుచుండెను. బిడ్డా! నాకు నీళ్లు త్రావింపుము స్థిర పురంబునుండి నన్నొకబండిలోఁ దెచ్చిరి. నే నలసి దప్పిగొని యున్నాననెను. చంద్రకల తన చేతులతో నెత్తి త్రావించెను. ఆమె పది పండ్రెండుసారులు ఆతురతతో ద్రావెను. వారికి పాత్రలు గిత్రలు లేవు. చేతులేపాత్రలయ్యెను.

ఆమె కొంత సేదదేరి భగవంతునకు వందనములు. నీ వేమిచెప్పితివి? భానునికూతురు చైతన్యవా? ఇపుడు నిక్కడయు భగవంతునకు జోతలు. నే నీమాట వినలేదు. నేను రెండేండ్లుగా నుత్కలపురంబున నుంటిని. పోయినవారమే స్థిరపురికిఁ బట్టి తెచ్చిరి.

అవునమ్మా! అప్పటినుండియే నేను ముత్తయిదువగను విధవగనైతిని.

ఎవరిని పెండ్లియాడితివి బిడ్డా?

మాధవ వర్తకుని. ఆరునెలలకు ముందు అతనిని మల్లరంగమునఁ జంపిరి అని చెప్పుచు వెక్కి వెక్కి యేడ్చెను. నే నాసంగతి వింటిని, అది మేలైన సంగతియే. అతనియాత్మ మోక్షసుఖంబున నున్నది. ఖిల్లులతో జగడింపనని చెప్పినందున ఆనందముతో తలగొట్ట నుత్తరవిచ్చెను.

అమ్మాయీ యేడువకుము. నీ కథ కొంత చెప్పుము. కన్నీరు విడుచుటకుఁ గాలంబు లేదు. కన్నీరు విడువకుము అని ఆర్య చెప్పెను. చంద్రకల కనులం దుడిచికొనెను.

తల్లీ! నా కథ నేమని చెప్పుదును. దుఃఖావహంబును స్వల్పకాలంబు నైయున్నది. మాధవుఁడును నేను నొకరిపై నొకరు బద్ధానురాగులమై యుంటిమి. మా తండ్రియు నతఁడు స్నేహితులుగారు. వర్తకంబునఁ బోటాపోటులుగ నుండినవారు. ముందేమియు నెఱుంగనివాడగుటచేత గౌడుల మతంబగు వైష్ణవంబు నవలంబించి యుండెను. మాధవుఁడు తన బద్ధవైరియైనను తనవలె వైష్ణవుండుగ నుండుటచేత కన్నతనికిఁ బెండ్లి చేసియిచ్చెను. ఇద్దఱునుగలిసి భాగస్థులుగా వర్తకంబు సలుపుచుండిరి. గోరంగస్వామి శిష్యులు స్థిరపురంబునకు వచ్చిరి. వారి బోధలనువిని యమందానందులమై చైతన్యులమైతిమి. మా తండ్రి వీరవైష్ణవుడు. చైతన్యుల మాట కలనైనవినడు. నా మగఁడు పైకి వైష్ణవుండుగను లోనికి చైతన్యుడుగనుండి బూటకంబులఁ జూపువాఁడుకాడు. కావున జరిగిన వర్తమానంబును నా తండ్రి కెఱింగించెను. తల్లీ! యేమందును? నా తండ్రి భూమిపగుల దన్నెను. కేకవేసెను మమ్ము శపించెను. మా మతంబును నిందించెను. నేను నాసంగతిని మాతండ్రికి దెలిపినపుడు మఱి పదింతలు గోడువచ్చెను: కన్నకూతురని కూడ నెన్నక నన్నును నామగనిని మహంతునకు బట్టియిచ్చెను. మహంతు పల్లవుల కొప్పగించెను. వారలు మమ్ము చెఱయందుంచిరి. మహంతులును పల్లవులును దోచుకొన్న సొత్తుకాక మిగిలిన సొత్తంతయు నా తండ్రియొద్దనే యున్నది. అనేక నెలలవఱకు నామగండును నేనును నిచట జెఱయందుంటిమి. కడకు నతని మల్లరంగమునకు గొనిపోయి నఱికిరి. ఈ త్రామతోడ నే నిక్కడ నిలిచితిని. మాతో నీమెయు చైతన్య యైనకతంబున నీ గతియే ప్రాప్తమయ్యెను. నేను ఆనందుని యుత్తరవుచేత నా ప్రాణములును నీమె ప్రాణములును గోలుపోవఁ గాలమువచ్చినది.

బిడ్డా! యిందులకై యడలనేల? ఈ తరుణంబు వచ్చినందులకై సంతోషపడవలయును. నీమగనిని గోరంగని జూడఁగందువు గదా!

తల్లీ! నాకు సంతోషమే. నా స్థితిని గంటివా? ఇంత వ్యసనమును ఈ బిడ్డకై యేగాని యొండుగాదు. ఇదిమాత్రము తప్పి బ్రతికె నేని మనమందఱముఁ జచ్చినను గ్లేశంబులేదు. బిడ్డ చావఁగూడదు. కూడదు.

ఆర్య యుఱిమి చూచెను. బిడ్డా! నీవు పసిదానవై యుండియు నిది వలయును. ఇది గూడదని దేవునెదుట జెప్పుటకు ధైర్యంబు గొంటివా? కాఁగల కార్యంబులు భగవంతుని కరంబుల నున్నవి. ఈ యానందుఁడు, మీ తండ్రి, పల్లవులు, గౌడులు, తోడ్పెడిపులులు అన్నియు దేవునిచేత నున్నవి. అతని యిష్టముకాక వేఱువిధంబుగ నెట్లగును? కావున నతని నుతింపుము. ఆనందింపుము. తేపన్న మాట నెన్నకుము. ఈ దుఃఖ భాజనంబగు లోకంబుననుండి గోడుగుడుచుట కన్న భగవంతుని పాదారవిందంబులం జేరుటయే యుత్తమోత్తమంబు.

తల్లీ! నీవన్నమాట సరియైనదే. ధైర్యంబుననుండఁ బ్రయత్నించెద. నా కేదియైన సంభవింపనిమ్ము. నాస్థితి నన్ను బలహీనం జేసెడిని. నిజంబుగా నా యాత్మ సంతసించుచున్నది గాని మనస్సు దుర్బలమైయున్నది. ఎవరో పిలిచెదరు. వినుము. భగవంతు నారాధింపఁ బిలిచెదరు. ఇదియే మన కడపటి యారాధనంబు. అని చంద్రకలతేచి ఇతరులున్నచోటికిం బోయెను.

ఆర్యను లేవనెత్తుటకై తామ్రయచటనే యుండెను. చంద్రకల కొంతదూరము పోగనే యవ్వకై వంగి, తల్లీ! నీవెఱుంగుదువు. నా యజమానురాలు బిడ్డను సురక్షితముగా బ్రసవించునా? యని యడిగెను. ఆర్యకనులెత్తి నింగికై చూచి మెల్లన నిట్లనియె. బిడ్డపుట్టి దీర్ఘకాలము జీవించును. పులులు మనల నెవ్వరిని తేపటికి దినవు. అయినను మనలో గొందఱు వేఱువిధంబుగ జత్తురు. ని యజమానురాలును కొద్ది దినములలో దివికేగును. నా కిది తెలిసియుండియు తెలుపరాదని యుంటిని అని చెప్పెను. అంతటఁ దామ్రయు, అమ్మా! నేనును జచ్చిన బాగుండునని యెన్నెద ననియె. ఆర్య, ఏలనే? తామ్ర, నా యజమా

నికి తోడెవరు ? ఆర్య, తావరాళి ! అట్లుకాదు. ఆమె బిడ్డనుసాకుటకు బ్రతికియుండుము. అంతయు ముగించిన వెనుక దివికిఁబొమ్ము.

అది యెండకాల మగుటవలన, ప్రతిదినమును ప్రదర్శనంబులు తెల్లవాఱినదే యారంభమై పదునొక్క గంటలకే ముగించునటుల నుత్తరువు చేయబడి యుండెను. ఆ ప్రదర్శన రంగము ఇరువది వేలకన్న నధికజనంబులఁ బట్టునదియైనను, మితిలేని జనంబులు వచ్చుటచే నదిచాలకుండెను. రాత్రి పంౘ్రెండు మొదలుకొనియే టిక్కెట్లను కొన నారంభించిరి. తెల్లవాఱుటకు మునుపే రంగము నిండియుండెను. అచట వెలితి యేమిలేదు గాని రాజు రాజుపరివారము, సామంతరాజులు, పులుల కెఱఁగాఁగల చైతన్యులు వీరుమాత్రము వచ్చి కూర్చొనుటకు చోటు వదలియుండెను. ఈ చైతన్యులనందఱును జూచుటకై పులులకడ విడుచుటకు మునుపే రంగమున వచ్చి కూర్చొని యుండునటులఁ జేసిరి. చంద్రకల యితరులతోవచ్చి కలసికొనునపుడు, పూజ కారంభింపఁ బడి యుండెను. పూజ నారంభించిన యాతఁడు చైతన్యుని కనులాఱఁగాంచి యతనికి శుశ్రూషలం దనరుచుండిన అగ్రశిష్యుఁడు. ఒకప్రక్క పులుల అొప్పులు, ఒకప్రక్క చూపరుల కూతలు, ఒకప్రక్క మరణభీతులు ఇన్నియు నొకటిగానుండ నీ పూజయేమి ? ఇట్టికాలమునందును మరణ భయంబులేక భగవంతు నారాధించినవారి భాగ్యంబె భాగ్యము. వారు చావునకు భయపడుదురా ? పెండ్లికి పోవువారివలె నానందముగాఁ బులులకడకుఁ బోరా?

అపుడగ్రపీఠ మందున్న పూజారి, సోదరులారా ? మీ కానందమే యనియె. అందఱు నేక వాక్యంబున నానంద మానంద మనిరి. బిడ్డలును నిదేమాదిరి జెప్పిరి. ఔరా! భగవద్భక్తి విశేషము ! వారు భగవంతుని మాటిమాటికి భజంచిరి. ఆ ముసలయ్య యందఱిని దీవించెను. అందఱును ప్రదర్శన రంగమునకువచ్చి కూరుచుండిరి. చంద్రుఁడు గ్రుంకెను. సూర్యుఁ డుదయించుటకు నింక నొకగంట కాలముండెను. కావున రంగమంతయు జీకటిని మునిగెను. అచటచటఁ గొందఱు దివి

టీలుపట్టుకొని యుండినందున చీకటి కొంతయు వెలుతురు కొంతయు నుగా నుండెను. అపుడు పూజారి "సోదరులారా! రాజులారా! మహారాజులారా! పల్లవులారా! గౌడులారా! ఓఢ్రులారా! ద్రావిడులారా! తక్కుంగల మహానుభావులారా! చావుటకు సిద్ధమైయుండు ముదుసలినగు నా మాటవినుడు. మీకు నిష్టముండినయెడ చిలుకసరస్సున మునిగిపోయిన మహానుభావుని చరిత్రంబు వినుడు. నిజము తెలియుటలో మీకు బాధకంబు లేదు అనియె. అపుడు చెఱకాపరి నోరుమూయుము. మీ పిచ్చిమతము నుపన్యసింపకుము అనెను. ప్రదర్శనంబు చూడ వచ్చినవారలు అతనిని వదలుడు. అతని కథను మేము వినవలయును. అడ్డగింపకుడు అడ్డగింపకుడు అని కేకలువేసిరి. ముసలివానికి కొంత ధైర్యంబు వచ్చెను. ఇరువది నిమిషముల వఱకుఁ దన సామర్థ్యమును జూపుచు నుపన్యసించెను. అందఱు ప్రమానువడి వినుచుండిరేగాని వలదన్న వాఁడెవడునులేడు. అపుడు దూరంబుననుండి వినుచుండిన యొకడు ఈ చైతన్యులు మనకన్న బుద్ధిమంతులుగ నున్నారు. వీరేల చావవలయును అని కేకవేసెను.

అత్తఱిని నీ ముదుసలి పూజారి యిట్లనియె. నేస్తా! ఆనంద మహారాజుగారి చిత్తానుసారంబు మా మరణంబు. మమ్ముల జంపుటకు భగవంతుఁ డతనికి శక్తిని బ్రసాదించి యున్నవాఁడు! మేము భయంకర మరణంబును బొందెదమని దుఃఖింపకుము. మా జన్మము సఫలమగు మంచి కాలమిది, ఓజనులారా! ఆనందునకై దుఃఖింపుడు అతని చేతులు మా రక్తములచేఁ దడపఁబడుట కైనదే యని యతనికై వగవుడు.మీకై మీరే చింతింపుడు. మా సమీప వర్తినియగు మరణము మీలోఁ గొందఱి దగ్గఱను ఉండును పాపమరణాక్రుష్టులగు మీరెట్లు మేలు కొందురు. అల్ల సింహాసనంబును భగవంతునసిధార ముగించిననేమి? వానిని భగవంతుఁడు పిలిచికొన్ననేమి ? ఎవ రడ్డపడుదురు. మీరు మాత్రము ఇచటనే గూటంబు కొట్టుకొని యుందురా? మీరు చేసికొన్న సుకృత దుష్కృతములు తప్ప భూమియందు నిలిచియుండునది యేది? ఓ నరులారా! గాలి యున్నపుడే తూరుపెత్తికొనుడు. అసు

వులు బొందియున్నపుడే భగవంతు శరణందుడు, మీ కీసంగతిని జెప్పు మని హృదయంగముండైన యీశ్వరుఁడు, పులివాతబడు నాకుఁ బ్రేర కుండై నకతంబున నెఱింగించితిని. భగవంతుని మీరు చూడకున్నను మిమ్ముల నతండు దగ్గఱ నుండియే చూచుచున్నవాఁడుడు. ఇట్టి పాపకృ త్యపరులగు మిమ్మును మీ రాజును క్షమింప భగవంతుని బ్రార్థించెద. కుశలము. కుశలము.

మిమ్ముల నతండుదగ్గఱనుండియే చూచుచున్న వాఁడు అనుమా టలు సభవారి చెవులంబడినదే, యదేమి మాయయో, యందఱును నలుప్రక్కలఁ జూడసాగిరి. చూచుడు చూచుడను కేకలు వినంబడియె. అందఱును దలలెత్తిచూచిరి. చీకటియందు నేదోయొకటి స్పష్టలేక వారి తలలమీదుగాఁ బోయెను అది రెండుమూడుతడవలు కనబడి రాజ సిం హాసనంబు ప్రక్కబోయి మాయమయ్యెను. అపు డొకడు భగవంతుఁ డని కూసెను. ప్రజలందఱు దుఃఖించిరి. మఱియొకడు, మూఢా! యేమి యంటివి. అది యొకపక్షిరా యనెను. ఇంకొకడు రాజునకుగాను భగ వంతుఁడు గూబయైరాడుగదా యనెను, కొందఱు నవ్విరి. అనేకు లూ ఱకుండిరి. ఆనందదివాంధచరిత్ర మూరివారికి దెలిసినవిషయము. కుశ స్థలియం దితనికి మకుటాభిషేకంబు జరుగునపుడు గూబ యొకటి కనం బడెను. అపుడు శాకునికులు, రాజా! యిది జయ సూచకంబు. అయిన నిదియే యెపుడైన మఱియొకతూరి కనిపించునేని మరణ మాసన్నమని యెఱుంగుమని చెప్పియుండిరి.

ఆ సమయమునందే మంగళ తూర్యంబులు నగరున మ్రోగెను. ఆనంద మహారాజు తన పరివారంబుతో జనుదెంచు చున్నవారని దూ తలు చాటించిరి. వాద్యములు దగ్గఱించెను. ఆనందుఁ డానంద సహి తుండై రంగంబున కేతెంచి సామంత రాజులతోడ సింహాసనా సీనుండ య్యెను. మల్లురు మొదలైనవారలు తాము చచ్చుటకు మునుపు రాజు నకు సైవారంబుచేయుట యలనాటు. కావున దానికై మునుముంద సన్న యియ్యబడెను. మల్లురు వివిధాయుధధరులై రాజున కభిముఖులై

జయజయ సుఖీభవ ఆనందమహారాజా ! మరణ సిద్ధుల మగు మేము మిమ్ము నమస్కరించెదము, అనిరి. రాజు మందహాసంబు చేసెను. సభికులు చేతులుదట్టిరి. ఒకరివెంట నొకరుగ ననేకులు కైవారంబు చేసిరి. కడపటం జైతన్యులువచ్చిరి. వారి పూజారి వాక్యంబులను విని తందరపడిన ప్రజలు వారానందమునం బోవునపుడు గొల్లుమని చేతులుతట్టి నవ్విరి. ఆ నవ్వులను వారు లక్ష్యపెట్టక రాజు నెదురవచ్చిరి ప్రజలు కైవారమని కూసిరి పూజారి చేతిని జూపెను అందఱు నూఱకుండిరి. సన్నని యెలుగుతో, రాజా! చచ్చుటకు సిద్ధులమై యుండు మేము నిన్ను క్షమించెదము. భగవంతుం డట్టులం జేయుంగాక యనెను చూపఱులు నవ్వుల నిలిపిరి. రాజు కోపంబుతో నా వలపొండని సైగచేసెను. ఆర్య మూడుకాళ్ళ ముదుసలియగుటచే మెల్లమెల్లన దూరమున వచ్చుచుండి కొంతవడికి రాజు నెదుటికివచ్చి యచటనిలిచెను. పరివారము తొలగుమనిరి. ఆమెకదలను లేదు మెదలనులేదు. అట్టె నిలంబడి మిన్నకుండెను. తన చేతికఱ్ఱపై నూనుకొని రాజు మొగంబు నుఱిమిచూచెను. రాజు ఆర్యనుజూచెను ఇద్దఱి కనులుచేరినదే రాజునకు మొగంబు తెల్లనాయెను. ప్రయాసతో ఆర్యనిలంబడి తన కట్టెతోం మీదజూపెను. అందఱును మీదజూచిరి ఏమియుం గనంబడలేదు. రాజునుజూచెను రాజునకేదియో తోచినందున లేచినవాండు దన సింహాసనంబుపై నొఱగెను. ఏదో యోచించుచుండెను. ఆర్య గిఱుక్కుమని తిఱిగి కుంటుచు బరువెత్తివచ్చి తన వారితోం గలిసికొనెను. వారి వారి తావులందు వారు వారు చేరిరి.

రెండవతూఱి మనస్సును గుదురుపఱచుకొని, ఆనంద మహారాజు సింహాసనంబునుండి లేచెను. సూర్యకిరణంబులు వాని మొగంబున సూటిగాంబడెను. ఆనందుండు పొడవును గాంభీర్యమునుగలవాడు. అతని వస్త్రాభరణంబులు దేదీప్యమానంబులై యుండెను. నీడనుండి చూచినప్రజలకు నతనిదేహము వెండివలెం బ్రకాశించెను. ఆతని కిరీటము, కవచము, వస్త్రములు అన్నియు రజతప్రాయములు అటులలేచి ఖడ్గ నారాయణ చక్రవర్తిపేరిట, చక్రవర్తిగారి గౌరవార్థమై వినోద

ములఁ బ్రారంభితురగాక యని ముదల యిచ్చెద ననిరి. మూఁగియుండిన జను లొక్కపెట్టున భగవద్వాక్యము భగవద్వాక్యము ఆనంద భగవద్వాక్యమని ఘోషించిరి. ఆనందుఁడు వలదన్న వాఁడుగాఁడు ఇఱువదివేలగొంతు లొక్కపెట్టున మ్రోగుటచే సురను ద్రాగినవానివలె పరవశుండయ్యె, కొంతవడి యట్టులన నిలిచెను. సూర్యకిరణంబులు వాని నుదుటఁ దాండవ మాడుచుండెను. ప్రజలు వాని నామంబును భగవన్నామంబుగ గొనియాడుచుండిరి. వానికనులు మిఱుమిట్లు గొలుపుచుండెను. ముక్కుపుటములు పెద్దవయ్యెను, అల్లనల్లనఁ జేతుల వీచెను. అట్లగుటకుఁ గారణంబు క్షుద్ర జంతువగు తన కీర్తిగౌరవ మట్లు కలిగెనను నాశ్చర్యమో లేక తానే భగవంతుఁడో యను నిశ్చయమో యేదియో యొకటి యుండవలయును. ప్రజలు వానిని భగవంతు నట్లే పొగడుచుండిరి. వాఁడు నిలుచుచుండెను, కడుపున వేదనయొకటి కలిగెను. తాను నశ్వరుండగు జీవుండని యెంచుకొనెను, చావు సమీపించినదనియు నెఱింగెను. వాఁడు కడుపునుబట్టుకొని, అయ్యో ! నేను భగవంతుఁడను గాను మీవలె నేను నొక మనుజమాత్రుండనే మనుజులకు సహజ ధర్మంబగు మరణ మాసన్నమైనది యని యఱచెను.

అపుడు తన తలకు సూటిగానుండి యొక గూబ యందఱికిఁగనఁబడి యొకమూల దాగెను. అపు డానందుఁడు ప్రజలారా ! చూడుడు చూడుడు నాకు శుభంబును గూర్చినపక్షి నన్ను వదలిపోవుచున్నది. నేను చచ్చెదను, నేను చచ్చెదను, అని యఱచెను. ఇంతకు మునుపే తానే యీశ్వరుండను మమతచే బూజలంగొన్న వీఁడు బాధచే నేడ్చుచుండెను. పరివారజనంబులు దబ్బునబోయి రాజు నెత్తికొనిరి, నన్నిట నుండి తీసుకొనిపొండు అని రాజు ఏడ్చెను. అపుడు దూతయొకడు ప్రజలారా ! రాజునకు దేహము జబ్బయినది వినోదములు జరుగవు. మీ మీ యిండ్లకు బొండు అని యెలుగెత్తి కూసెను ప్రజలు భయాక్రాంతులై కొంతవఱ కచటనే కూర్చుండిరి. గొలగొలమను శబ్దము కొంతసేపటికి బుట్టి మహా ఘోషమయ్యెను.

## మాయారాక్షసునిబంధించిన

చైతన్యులు చైతన్యులు వారే చెప్పు
తోడంబోతు పెట్టిరి. వారి మాంత్రికులు. వారిని
వుడు! తోడనే వేనవేలు జనులు చైతన్యులుందు
జుట్టును బొడుగుగోడ లుండుటచేత దగ్గఱకు రారైరి. కాపరుల నావలికి నెట్టిరాఁ జూచిరి చైతన్యు లేమిచేయుదురు. ఒకరి నొకరు త్రొక్కులాడిరి. వారి యందొకరు నేటికి చావు నిజము అనియె, అట్లుకాదు, మన ప్రాణములు దక్కును, వెంబడింపుము, నాకు దారి తెలియును. అని తామ్రము చంద్రకల నడుమును పట్టుకొని బరబర యీడ్చుచు వెనుక ద్వి త్రోవను దూరెను. అచటి తలుపు తెఱువబడియుండెను గాని యొధుఁడు కావలి యుండెను. వాడు తన యీటెనుజూపి వెనుకకు నిలుమని యదలించెను. తామ్ర మఱుమాట లాడక చురియనెత్తి వాని బొమ్మున నొక పోటుపొడిచెను. వాడు కుయ్యో మొఱ్ఱోయని దిగఁబడెను. వెనుక వచ్చెడివారు వానిని త్రొక్కి చంపిరి. రంగమునుండి భయంబునఁ బారిపోవుజన సమూహంబులతోఁ జేరి పఱువెత్తసాగిరి. అందు గొందఱు కత్తివాతఁ బడిరి. మఱికొందరు త్రొక్కుళ్ళ నలిగిరి. కొందఱు ప్రాణములతోఁ దప్పించుకొనిరి. వారిలో నీ తామ్రమయు చంద్రకలయు నొకరు. ఒక చోట వీరు చేరి, తామ్రమా! యిపు డెచటికి, అమ్మా! యిక్కడ నిలువకుము. ఎక్కడికో యొక చోటికి రాఁబొమ్ము అనియె. కడమవారి గతియేమి యని చంద్రకల యడిగెను, అమ్మా మనవలనంగాదు. భగవంతుఁడు రక్షించును అని తామ్ర చెప్పెను. తారా! నన్ను వదలుము, నేఁ జచ్చితిని, నీ ప్రాణములను దప్పించుకొమ్ము అని చంద్రకల చెప్పి దిగువఁ గూర్చుండెను. తామ్ర ఆమెను జవిరి యెత్తుకొని నా యజమానికి, పల్లవ భామినికి, త్రోవ త్రోవ యని యఱచుచుఁ బఱువెత్తెను. జనులు తొలగిరి.

ప్రదర్శన రంగమును వదలి యొకవీధికి వచ్చెను. ఎక్కడ దాగుదురు? చైతన్యులని తెలిసిన కొట్టి కాకులకు వేతురు. అటు నిటు చూచెను. ఒక పాడు మేడయుండెను. దానియందు నిండ్లులేని బిచ్చగాండ్రు వసించుచుందురని యటనుండు బూడిదె బొగ్గులచేఁ దెలిసికొనెను అట నుండు

## ...సునిజయించిన మనోరమకథ.

...బిచ్చగాండ్రు వచ్చి చూడరా? ఆ మేడను ...కట్లు కనబడెను. దాని పైనెక్కిచూడ నొకగది ...యుండెను. ఇక నేమిచేయుదు దిగుదమని దిగఁబోయెను. తారువ దేండ్ల ఆడుదానిని ఎత్తుకొని ఎక్కుటయే కష్టము దిగుటయెట్లు? తలుపును తోసెను తెఱచుకొనెను ధాన్యపుమూట లందుండెను. ఆ ప్రదేశ మిపుడు రాణువ కుపయోగించుట లేదని యెఱిగికొనెను. చంద్రకల నటఁ బరుండఁబెట్టెను తలుపును దెఱచికొని పడికట్లు దిగి దిగువనుండిన నీళ్ళకుండ నెత్తికొని పైకి నెక్కి గడియ వేసికొనెను. చంద్రకల మొగంబున జల్లెను, కనులు దెఱచిచూచి అంతయు నైనదా ఇదేమి స్వర్గమా యనియె. తల్లీ! యిది స్వర్గంబుగాదు గాని యా నరకంబునుండి వచ్చిన మనకు నట్లు తోచును. అది పోనిమ్ము నీరు ద్రావుమని నోటి కందియిచ్చెను. చంద్రకల తారావి నా ప్రాణము లిపుడు కుదిరినవి మనమెట్లు అల్లరిగుంపును దాటి వచ్చితిమి తామ్ర యేమియు నెనక కుండనని యంతయు ద్రావెను. ఆవల జరిగిన దంతయు జెప్పెను. తారా! నీ వలన నేను బ్రతికితిని గాని లేనిచో జచ్చియుందును. నీ కెంతబలమో తారా! నీకెంత ధైర్యమో గదే, చంద్రకలా! యట్లనకుము. మనల భగవంతుఁడే రక్షించెను లేనిచో నా పోటు తగిలియుండునా యని తామ్రియనియె. ఏమి? వానిని జంపితివా? యని యడిగెను. ఆర్యాంబ మునుమున్న చెప్పినవిధంబున వాడు కత్తి పోటున మడిసెను. ఇపుడు జ్ఞప్తికి వచ్చినది. నా చురియయందు నెత్తురు మరకలుండును, మనము వానిని జంపితిమనుటకు వేఱు సాక్ష్యము కావలయునే యని మంటికొరుద్ది నీటితో కడిగి తోలుతో తుడిచి భద్రపఱచెను.

ఈ పనియైనదో లేదో యొక సందడి వినబడెను. అమ్మా! నీ పుణ్యము లూఱకుండుము. అని చెవిలోఁజెప్పి, యా చప్పుడును జెవి యొగ్గి వినుచుండెను. వీరిని వెదకుకొని ముగ్గురు మొనగాండ్రు వచ్చిన చప్పుడది, అందులో నొకఁడు "అన్నా! యీ వీధిగుండా యొక రాచపుత్ర స్త్రీ గౌడస్త్రీ నొకతెను జేతుల నెత్తికొని వచ్చినట్లు ఒక తాత నాకు బాసయిచ్చెను. ఇక్కడ లేకపోయిన మఱి యెక్కడనుండును

అనియె. మఱి యొకడు సరేరా! యీచోటు నిశ్శబ్దముగా నున్నది. మన మిటనుండి కదలుటయే మేలు. వినోదము లిపుడు జరుగునట చూడఁ బోవలయును అనియె. ఇంకొకడు మన స్నేహితుని బొడిచినది రాచపుత్రస్త్రీగదా, యని యడిగెను. వారట్టులనే చెప్పెదరు. వాఁడు అప్పమువలె క్రిందఁ దొక్కఁబడి పడియుండెను. వాని నెత్తునపుడే తల కాళ్ళు మొండెము వేఱువేఱుగను శిథిలంబుగా నుండినవి. ఇది యిట్లని నిర్ధారణచేయ వీలులేదు. వాని స్నేహితులు గూడ రాచపుత్రస్త్రీలను బట్టి తెండను చున్నవారు. వారేమి చేయగలరో ఎవరికెఱుక యని యొకడు చెప్పెను. మొదటివాఁడు ఏమి మాటలురా మనము పోరాదా రెండవవాఁడు నిదానించి చూచి, ఓరీ! నీకండ్లు నిప్పులుబడ ఇదో పడికట్లున్నవిగదరా. పైకిఁబోయి చూచివత్తము ఇది యెవరి కుపయోగమురా. ఆ మార్వాడి దొంగ అభిరాముఁడు ధాన్యములను నట దాచియున్నవాఁడు. వాఁడు తెఱచి యుంచి యుండునని ఎవరు తలంతురు?. అనియె.

తోడనే యెవరో యెక్కివచ్చుశబ్దము వినఁబడెను. తలుపును దగ్గరించునటుల దోచెను చంద్రకల కనుల మూసికొని ధ్యానించెను. తామ్ర కుడిచేతఁ జురియ నుంచుకొని యెడమచేతఁ గడియను బట్టుకొని పులివలె నిలిచెను. మొనగాడు అటవచ్చి తన శక్తినంతయు వినియోగించి, తలుపును ద్రోసెను. తలుపు తాళము వేసియున్నదని తృప్తి చేసికొని దిగెను. తామ్రకు ధైర్యంబు వచ్చెను. చెలి యొగ్గి వినెను.

మఁద్దె యెక్కి వచ్చినవాఁడు తాళము వేసియున్నది. అభిరాముని దగ్గఱకుబోయి తాళములు తెచ్చి తెఱచిచూచుట మంచిదని చెప్పెను. ఒక డదివిని ఔరా! నీ సంగతి యిపుడు తెలిసినది. నీవు రాచపుత్రస్త్రీపైననో గోడమీఁదనో మరులుకొని నట్టులున్నది. [illegible]సైన్యాలట్లు వాఁలో నగ్రగణ్యుఁడ నని రాజున కెఱింగించెద. రాజు కెపుడు వేసినతో నెటుల నున్నవారో పోయి చూడవలయును. ఒకవేళ నానొక్కి మనబాకీల నిచ్చివేయుమని చెప్పుటకు వచ్చి యుండును. ఈ తడవ బాకీలు తీర్చినా సరే, లేనియెడల నేపని యైనను జూచుకొనియెదను.

అనెను. లేదు, లేదు. అభిరాముని కడకేగి తాళము తెచ్చి తెఱచి చూచుటయే మంచిది అని రెండవవాడు చెప్పెను. అభిరాముని దగ్గఱకైనను బొమ్ము కాముని దగ్గఱకైనను బొమ్ము. ఈయింటి బీగములైన నరకబీగముల నైన దెచ్చుకొమ్ము వాఁడిటకు రెండుమైళ్ళ దూరములో నున్నాఁడు. అని కోపంబుతో నధికారి చెప్పెను అందులకు గాదండి కాదండి నేను నటువలయునని కోరి చెప్పినదికాదు. చైతన్యులను వెదకుచున్నవారము గదా. బీగములను దెచ్చి తెఱచి చూచిన మంచిదని జెప్పితిని అనెను, మువ్వురునుబోయిరి. తామ్రకు నోట తడివచ్చెను కరుణాకరునకు నమస్కారములు వారుపోయిరి అని యామె యనెను తారా! వారు మరలరారా? వారు మఱల వత్తురని దిగులందెద. నని చంద్రకల చెప్పెను. వారిక రారు వారి యధికారి కోపించుకొనెను. అభిరాముని కడకుబోయి బీగము తెచ్చునంతటి శ్రమను బుచ్చుకొనరు ఈ పండుగలలో ధాన్యము కొని పోవుటకు అభిరాముఁడు వచ్చునని మాత్రము భయపడెద ఈ మాటలు తామ్ర నోటనుండి వచ్చినదో లేదో బీగములు గలగలమను శబ్దము చెవులఁ బడెను. తలుపు త్రోసెను గడియ పడిపోయినది తలుపు తెఱువఁబడెను. అభిరాముఁడు లోనికవచ్చెను. మఱి యెవరును రాలేదు మఱలఁ దలుపు మూసికొని లో తాళంబు వేసికొని, తాళము సందులోనే యుంచెను. అచటనుండిన గనుక చిన్న మేజాకడకు రాఁగనే తామ్ర చివాలున లేచి తలుపుకడఁ బోయి నిలిచె. అభిరాముఁ డులికిపడి ఎవరు నీవు అని యడిగి దిగువఁ గూర్చొనియున్న చంద్రకలనుగని యచ్చెరువంది నీ వెవరవని యడిగెను మీరు పిశాచములా? దొంగిలా? బనచేయుటకు వచ్చిన వారా? వీరభటులు వెదకికొని పోయెడి చైతన్యులా? యనెను, తామ్ర యందుకొని "ఔను మేమా చైతన్యులమై మల్లరంగమునుండి ప్రాణంబుల దక్కించుకొని వచ్చినవారము. ఇచట మమ్ములఁ జూడవచ్చిరయిన గొంత తప్పెను. అభిరాముఁడు "సరి మిమ్మనేల. ఇంటిని తాళంబు వేయక యుంచునందుల కీలాభము. మీ రేమియు ననుకొనకుఁడు. అది నాతప్పుగాదు, నా జీతగానిది వానిని మందలింప వలయును. అది నేను జెప్పదను లే" యని తలుపునొద్దకు వచ్చెను. "నీవు పోగూడదని తామ్ర

యడ్డగించెను. నీ వెటుల నడ్డగింతువని యడిగె. ఇంతకుముందు ఆ యోధునిపడిచిన బిచ్చువాతో నిన్ను పొడిచి నిలుపలేనా ? యనియె. నాయొద్ద బిచ్చువాయుండిన నేమిచేతువని మార్వాడి యడిగెను. అది నిజమైన నేదీ నీకత్తిని దూచుము. మగవాడో యాడుదో యెవరు గట్టి వారో చూతము. బనియా! కలమే నీకత్తి. రసపుత్రవైన నాతో నీవు దీటురావు అని తాంత్రమ చెప్పెను. అవును అది నిజమే మొరటు గూపుల కదియలవాటు నీవని నట్టులే నాయొద్దఁ గత్తియులేదు గిత్తియులేదు. ఇపుడు నన్నుఁజేయుమన్నదియేమి ? యని యభిరాముఁ డడిగెను. అపుడు తాంత్రమ "నీకుఁ దెలియుచుండలేదా ? నన్నేల యడిగెదవు. ఈ కుశస్థలినుండి మమ్ముఁ దప్పింపుము. అదియ మాకోరిక. అటులఁ జేయక వేఱువిధంబునఁ దలంచి తేని మనమందఱు మీకత్తివాతఁ బడు దుమని నమ్ముము. అదియునుంగాక నన్ను బానిసగాఁ దెచ్చి యమ్మిన మీ మార్వాడి జాతిపై నాకుఁ గంటుకలదు. ఈ నాకత్తి నీ బొమ్మను దూరనిచ్చెదవా ? యని కత్తిని దూసెను.

అవునవును నాకది తెలియును.ఏల కోపంబును జూపెదవు.మీరు ఈ యూరినుండి వేఱూరికిఁబోవలయునని కదా మీయిష్టము. నన్ను వెలుపలంబోయి సిద్ధంబు చేయనిమ్ము" అని యభిరాముఁ డనియె. "ఓరీ ! నీకుఁ బట్టినపిచ్చి మాకును బట్టియున్నదని తలంచితివా ? నీవు వెలికిబోయిన మేమును నీతోడరానలసినదే ! ఏల వ్యర్థంబుమాటలాడెదవు వినుము. ఈ భాగ్యవతి భీమునగారి కేకపుత్రి స్థిరపురంబు సాహుకారిసుమా నీ వతని యెఱుంగవా" యని తాంత్రమ యడిగెను. "భీమున గారా తెలియును తెలియును. నాతో రెండుమూడుతూరులు బేరంబు లాడెను. అని యభిరాముఁడు బదులుచెప్పెను. "సరి ! అతఁడు ధనవంతుఁడని నీ వెఱుంగినసంగతియే. ఈ యాపత్తునుండి యీమెను దప్పించితి వేని పెద్ద మొత్తము నియ్యగలఁడు." అని తాంత్రమ చెప్పెను. అతఁడియ్య వచ్చును గాని యది నిశ్చయంబనరాదు.అని యభిరాముఁ డనియె. నాకది నిశ్చయమే. మా యజమాని మీకొక హుండి యిచ్చుచున్నది. దానిం గొనిపోయి యతనికిఁ జూపితివేని నీకియ్యఁడా ? యని తాంత్రమ యనియెను.

అభిరాముఁడు:—నిజమే ఇపుడుండు సందేహమెదియన నతఁడాహుండిని గౌరవించునా? అతఁడు వీరవైష్ణవుఁడు. గాఢులలో గాఢుఁడు. చైతన్యులకు గంటి గాల్చువాఁడు.

తామ్ర:—అతఁడు గౌరవించునని తలంచెద నిజముగా గౌరవించును. ఆపని నీది బనియా! యిటుచూతుము. గొంతుకోతకన్న సందేహాహుండీ మేలుగదా.

అభి:—నిజమే నీ వాదము శ్రేష్ఠము. మీరిటనుండి తప్పించుకొనఁగోరెదరు. నన్నిచటనేయుంచి యుండిననెటులఁ జేయగలను.

తామ్ర:—అదినీవు యోజించుకొమ్ము. మాతోఁగాక నీ వొంటరిగాఁ బోవరాదు. మా మదికి భయముతోఁచినదే నిన్ను మొదటబొడుతును. హుండీ తీసుకొమ్ము.

అభి:—హుంవలదు నేనొకమాటచెప్పెద. నాకుఁ జైతన్యులపై మచ్చరము లేదు. శేరసారంబుల వారలు గౌరవస్థులు. నేటిరాత్రికొక యోడ స్థిరపురంబునకు బోవుచున్నది. దాని నెక్కిపోయెదరా? ఈతూరి నేను బోవ ద్దేశింపలేదు. నామాటనమ్ముము గణేశుపైఁ బ్రమాణంబుచేసెద నే బయటికేగి యన్నపానంబులఁ గొనివచ్చెద. మిమ్ములనుబట్టి యిచ్చుటలో నాకువచ్చులాభమేమి? ఒకవేళ భీమనగారికిఁ దనకూతురుని దప్పించితినను విషయములో సంతోషమై యేదైన నిచ్చునుగదా. అటుచూచిన లాభమున్నది.

తామ్రము తుదకొప్పుకొనెను. అభిరాముఁడు అన్నపానంబులను కొంతద్రవ్యమునందెయుంచి తెచ్చియిచ్చెను. వారాకలిగొన్నవారయినందున నదినిరి. అతఁడు మార్వాడివారి దుస్తులనిచ్చి తొడిగించి రాత్రియైనదే యోడ కడకుఁ దెచ్చి వీరలు మావారు స్థిరపురంబునకుఁ బోయెదరు. భద్రముగాఁగొనిపోయి విడువుము" అని తనయోడవారికి కట్టుదిట్టములు చేసెను. తామ్రయుఁ జంద్రికలయు సంతసించిరి. అభిరాముఁడు వారి

కడ నుత్తరవుతీసికొని యింటికివచ్చెను. ఓడ లంగరెత్తి పోవుచుండెను. రాత్రి మూడుగంటలకు జడివాన పట్టుకొనెను. పగటికంటెయు నధికముగా మారెను. నడు సముద్రమున బోవుచున్న యోడ యొడ్డునకు వచ్చుచుండెను. ఓడ వారివలన నిలుపుటకు సాధ్యంబుగాక పోయెను. ఒక కట్టమ్రానునువేసి యందు నందఱునెక్కి కొనిరి. తారామను జంద్రకలను మాత్ర మెక్కింపకుండిరి. వీరు చైతన్యులనియు వీరివలననే యీ యాపదవచ్చెననియు వారిభావము. ఉన్నట్టుండి యల యొకటిలేచెను. ఆ యురవడిచే వారలు బంతులవలెఁ బైకి నెగురఁగొట్టఁబడి సముద్రంబున మునిగిరి. ఈ యోడయు బైకిలేచినది. చంద్రకల భయంబుచేఁ గనులు మూసికొనెను. తారామ భగవంతుని ధ్యానించుచుండెను. కొంతసేపటికి తారామ ధైర్యంబుతెచ్చుకొని వెలివచ్చిచూడ నోడ గట్టునకు దగ్గఱ నిసుకలో నిలిచి కదల మెదలక యుండెను. వాన నిలిచెను. సాయంత్రము మూడుగంటలైనది. ఓడనుండిదిగి దగ్గఱ నేదైన నూరుండిన బోవుదమని తలంచుచుండ, చంద్రకలకు నొప్పులుపుట్టెను. రాత్రి పండ్రెండుఘంటలకు నొక యాఁడుబిడ్డను గనియె. దగ్గఱనున్న తారామజూచి "తారా! నేనొకమాటను జెప్పెద వినుము. ఈబిడ్డ యొకగంటసేపు బ్రతికినను లేక యొక నూఱేండ్లు బ్రతికినను తాను చైతన్యకావలసినదియు అదియునుగాక చైతన్యుఁడుకాని యెవరిని బెండ్లియాడరాదని బోధింపుము. ఈ యభిప్రాయము తల్లిదండ్రుల యభిప్రాయమని నొక్కి చెప్పుము అనియె. అపుడు తారామ మూలుగుచు "అమ్మా! నీవేల యిట్లనెదవు." అని యడిగెను. అపుడు చంద్రకల "తారా! నీకు వెలియదా నేనుజత్తును ఏమియును జెప్పకుము నాకది చక్కఁగాఁ దెలియును నా ప్రాణము లుబ్బుచున్నవి ఈ బిడ్డను గనుటకే నన్ను నింతవఱకు భగవంతుఁడు ఊపిరితోడ నుండజేసెను. నా ప్రార్థన లతనికి విన్నది కాఁబోలు నీ విటనుండి స్థిరపురంబునకుఁ బోవలవదు అట మాతండ్రి దీనికిఁగూడ వీరవైష్ణవునుగా జేయును. చిలుక సముద్రంబు కడనుండు వేదాంతుల గ్రామంబున కేగుము. అచట నా మేనమామ ఈశానాచునిం గనుము. నామెడనుండు నీగుఱుతుల నతనికిఁజూపుము. ఏదియునుదాచక కడవఱకుఁ జెప్పుము. అతఁడు చైతన్యుఁడుగాఁడు అయినను కరుణగలవాఁడు సన్మార్గ

దర్శి చైతన్యులద్వేషింపుచు చైతన్యనాశమునకై దుఃఖంబునొందువాడు మాకుఁజేసిన దుండగంబులకై మాతండ్రికిఁ గ్రూరమైనజాబులను వ్రాసినవాఁడు. మదలఁజెఱనుండి విడుదలఁజేయుటకుఁ బ్రయత్నించినది నీవె యుగవా? అతని చెల్లెలుమాత్రేనగు నాపైఁగరుణించి నాబిడ్డను నిన్ను ను గాపాడుచుటుల నేనుజెప్పితినని చెప్పుము. అటుచేయఁడేని భగవంతుఁడకు నీకార్యము నొప్పించవలయునని చెప్పుము. నాబిడ్డ మతమును మార్పక యామెకుగావలసినవి తనవలన నైనంత మట్టుకు మతవిషయంబులయందు సహాయుండగునటుల చెప్పుము" అనిచెప్పి మూర్ఛరాగానే నులుమూసికొనెను. ఇంతలోఁ దెల్లవాఱినదే చంద్రకల బిడ్డను జేత నెత్తుకొని "తారా! యీబిడ్డకు మాతల్లిపేరును బెట్టుము. ఇకనే పేరుఁజక్కఱలేదు" అనిచెప్పి పడుకొని దీర్ఘనిద్రఁజెందెను. తారామచేయునది లేక యటనుండిన తనపైకమును ఓడవారు విడిచిపోయిన పైకము నెత్తుకొని బిడ్డను పొదుగులఁబట్టికొని యా యోడకు నిప్పంటించి యటనుండి దిగివచ్చి గట్టుచేరెను. ఆ యోడయందు దైవవశంబున నూనెలుండుటచే దానికంటుకొని కాలిభస్మమాయెను. తారామ యో యని నేడ్చి యూరికై మఱలెను.

తారామ యూరిలోనికిఁబోవునపుడొక యాఁడుది గోడపై నానుకొని నిక్కిచూచుచుండెను. దానింజూచి యిటనీవేల నిటులఁజూచెదవని తారామ యడిగెను. ఆమె" తల్లీ! పల్లవులకై చూచుచున్నాను. మా గ్రామాధికారి పల్లవులకుఁ బన్నుఁగట్టనని నిరాకరించెను. వారందులకై కినిసి నిన్నటిదిన మిచటికివచ్చి యూరివారలఁజంపి కొందఱిని బట్టుకొని పోయిరి. ఈ కలవరములో నాచిన్నబిడ్డను వదలి పాఱిపోయితి వారలా బిడ్డనుగనికరంబులేక చంపిరి" అని యేడ్చెను. అమ్మా! నీ వెవరవని యని యడిగెను. అంతటఁ దాను "అమ్మా! నేను ఓడదరితట్టి విఱుగఁ దప్పించుకొని వచ్చినదానను నాకథఁజెప్పుట కేడులు పూడులుపట్టును. నాయొద్దఁ జిన్నబిడ్డ యొకటియున్నది. దాని కెవరైన పాలిచ్చువారుండిన జీతమిచ్చెదను, ఎవరైనంగలరే యని యడిగెను. ఆ యాఁడుది యాశతో "నాయొద్దనిమ్ము. నాకేమియు వలదు" అనియె తారామ యామె

నెగా దిగఁజూచెను. నీకిల్లున్నదా యని యడిగెను. ఇల్లున్నదమ్మా నా మగఁడు నున్నవాఁడు వేగ బిడ్డనిమ్ము అని యామె యాతనికి చెప్పెను బిడ్డ నిచ్చి తామ్రమ తనువెంట నడిచెను. వారలొకయింటి కేగిరి బిడ్డకు నా యమ్మ పాలిచ్చెను బిడ్డ నిద్రించుచుండెను. మగఁ డింటికి వచ్చెను తినుటకు వానికి కూడు లేకుండెను తామ్రమ దానిమగనిచేత కొంచెము మొహరీలుంచెను. వాఁడు మిగుల సంతసించి, యింటికి కావలసినవి తీసి కొని సుఖంబుండిరి తామ్రమ వారికడ నెలదినములుండెను. నెల కడ పటఁ దామ్రమ మఱల రెండు మొహరీలిచ్చి చిలుక సముద్రమునకుఁ బోవలసిన సంగతిని జెప్పెను. వాఁడు మఱింత సంతసించి యాఱవ నెలకు బిడ్డ కొంచెము పెద్దదగును. అపుడు నిశ్చయముగాఁ బోవచ్చు ననియె అయిదవ నెలయందు వానిచేత నాలుగు మొహరీలిచ్చెను. వాఁడు దానితో బండి యెద్దులు తీసి యాఱవ నెలకుఁ జిలుక సముద్రంబునకుఁ బ్రయాణమై చిలుక సముద్రంబును జేరిరి.

అచట మాదున కొక యాడుది యైనను గనంబడలేదు. ఒక మగ వాఁ డొకచోట వండుకొనుచుండెను. అతని కడకుఁ బోయి "అయ్యా! యీశానందస్వాముల వారెచట నున్నవారని యడిగెను. ఆ మగ వాఁడు మొగము ద్రిప్పుకొని యామెను జూడకయే ఇటనుండి సూటి గాబోయి కుడిప్రక్కపోవు దారిం బోయినవేని తెల్లయెద్దులఁ గట్టుకొని యున్న నతండే ఈశానంద స్వాములు అతఁడు రాత్రికే యింటికి వచ్చె ను. ఇపుడు మాకొలయు ననిన బొలమునకుఁ బోయెనని చెప్పెను. వా రటనుండి చెప్పిన యడియాలము బట్టుకొని పొలమునకు వచ్చి యీశా నందునిం జూచిరి. అతఁ డేబదియేండ్లవాఁడు గడ్డము పెంచుకొని పొడ వుగ నుండెను.

తామ్రమ యతనిం గని "స్వామీ! ఈశానందులవారు తామే గదా యని యడిగె అతఁ డవునని యొప్పుకొనెను. స్థిర పురంబున గొప్ప సాహుకారి యగు గౌడ భీమన్న గారి [illegible] మీనా[illegible] గారికి నన్నగారు మీరేనా? యనెను. ఆ మాట విన్నదే యతని ము

గంబు వాడెను. తోడనే యెప్పటివలె నగు మొగంబయ్యెను, "అప్పను నన్నట్లు చెప్పెదగు. మీనాంబ నా చెలికాలు ఆనె [illegible] బంధ నివ [illegible] వందిమున గోల లాడుచున్నది యనెను. ఈ [illegible] [illegible] గుగు నాత్రకెం యుండెనా. అని [illegible] అని తామ్రమ చెప్పెను. ఉండెనది? ఏమి? ఆమెను గూడ తన మాగినవెం జంపి రాయేమి? అని యడిగెను. "లేదండి స్వామీ" ఆమె ప్రసవించి చనిపోయినది ఇదియే యామెబిడ్డ యని నిద్రపోవుబిడ్డను జూపెను. అతం డాబిడ్డను జూచినదే సంతసించి వంగి ముద్దుగొనెను. లేదమ్మా! నీవా కథను జెప్పుమని యడిగెను. ఒకటియు దాచక తామ్రమ యతనికిం జూపి తన యజమానురాలి యానవాళ్ళను జూపెను. అతండు కొంత వడి నిదానించి ఆమెను జూచి నీవు నీ జాతి వారివలెం జపలవు గావు మోహంబు కల్పించుదానవును గావు అది యటుండనిమ్ము. ఆశుద్ధి [illegible] నన్నును [illegible] రాదని మాయాశ్రమ ధర్మము. [illegible] యీబిడ్డనుగాని యెటుల జెప్పగలను [illegible].

తామ్రమ కోపగించుకొని "ఏమి మాటలయ్యా! మీ యాశ్రమ ధర్మంబులు గిర్మంబులు నే నెఱుంగను. లోకాశ్రమ ధర్మంబులును, భగవదాశ్రమ ధర్మంబులును గొంత యెఱుంగుదును. నా యజమాని వలెనే నేనును చైతన్యనే సుమా, ఆ ధర్మంబు లెవి యంటివేని నీ వాకిటికి నెవరు వచ్చినను వారియెడ దయంజూపుమనుటయే అటుల దయ జూపకున్న నేలిన వానికి నుత్తరవు చెప్పవలయు ననుటయే యనియె.

నేను వాదులాడరాదు అందు నాడుదానితో నేల? నా మొదటి మాటలు నిజమే. అతిథి అభ్యాగతుల నాదరింప వలయునని మాధర్మములు బోధించుచునే యున్నవి. మిమ్ముల నేను వెడలం గొట్టను.

అటుల మాటలాడగా ఈ బిడ్డ నీ నెత్తురు ఈమె తల్లి చెప్పినమాటలు వినుము దీనిని భీమన్నకు నొప్పగింపకుము. వాడు మహాక్రూరుడు అని తామ్రమ చెప్పెను. నా కేమి యా సంగతి తెలియదా, మా

